# ఊరికే సరదాకి చిక్లెట్స్ హాస్యగాని

బొమ్మను పూర్తి చేయండి,
బహుమానములను
గెలుచుకోండి



అది ఎంతో తేలిక! ఎంతో సరదా! పైన ఇవ్వబడిన నెంబర్లను క్రమ ప్రకారము కలపండి. అలా చేస్తే, హాస్యగాని తమాషా అయిన బొమ్మ వస్తుంది.
పూర్తిచేసిన బొమ్మను, చిక్లెట్స్ 12 వున్న ప్యాకెటుయొక్క కార్డ్ బాక్సును, క్రిందనున్న కూపనుతో జతచేసి, ఇంగ్లీషులో మీ ఎడ్రసు వ్రాసి, వెంటనే పంపండి:

**Chiclets Product Officer CTL**
**Post Box 9116, Bombay 25**

దీనిలో 15 ఏళ్ల లోపు పిల్లలే పాల్గొనుటకు అర్హులు.




మొదటి 100 ఎంట్రీలు (ప్రతి భాషలో 10)
ప్రతి దానికి 4 కామిక్స్ లేక 'వరల్డ్ 100' అన్నీ వివిధ స్టాంపులు కలది పంపబడుతుంది.
చిక్లెట్లు ఇప్పుడు ఆరు మధురమైన రసముల రుచులలో లభిస్తున్నాయి: పెప్పర్‌మింట్, ఆరెంజ్, టూటీ-ఫ్రూటీ, లెమన్, పైనాపిల్ మరియు చాకొలెట్.

(దయచేసి మీ పేరు, ఎడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి)

నా పేరు..............................

ఎడ్రసు..............................

..............................

నాకు 4 కామిక్స్ లేక 'వరల్డ్ 100' అన్నీ వివిధ స్టాంపులు కలది కావాలి (ఏది కావాలో టిక్కు పెట్టండి).

చిక్లెట్స్—వేడుకతోవుంచే చూయింగ్ గమ్ విటమిన్లు ఎ & డి మరియు కేల్షియమ్ కలవి

# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికలోని బేతాళ కథ [" నిద్ర పోయిన రాక్షసుడు"] లో చాలా నిజం ఉన్నది. ప్రజలు జీవితంలో తమ శక్తికి మించిన శక్తులపై ఎప్పుడూ ఆశలు పెట్టుకుంటారు, ఆధారపడతారు; వాటిని చూసి భయపడతారు కూడా. ప్రాచీనకాలంలో దేవతలూ, తరవాత రాజులూ, వీరులూ ప్రజలకు అవసరం అయారు. ఒక్కొక్కప్పుడు వీరే ప్రజలను పీడించటం కూడా జరిగింది.

"కీలుగుర్రం" ఈ సంచికతో ముగిసింది.

సంపుటి 52 మే '73 సంచిక 5




తృణా దపి లఘు స్తూలః,
తూలా దపి చ యాచకః,
వాయునా కిం ననీతో సౌ?
త మయం యాచయే దితి! 1

[గడ్డిపోచ కంటె దూది తేలిక. దూది కంటె కూడా యాచకుడు తేలిక. అయితే గాలి యాచకుణ్ణి ఎందుకు ఎగరగొట్టదు? తనను కూడా యాచిస్తాడని!]

బాలసఖిత్వ, మకారణ హాస్యం,
స్త్రీషు వివాద, మసజ్జనసేవా,
గార్దభయాన, మసంస్కృతవాణీ,
షట్సు నరో లఘుతా ముపయాతి. 2

[పిల్లలతో స్నేహమూ, కారణం లేని పరాచకమూ, స్త్రీలతో తగవులాటా, చెడ్డవాడికి సేవా, గాడిద సవారీ, సంస్కారం లేని మాటా—ఈ ఆరూ చులకనైనవి.]

కిం పౌరుషం రక్షతి యో న వార్తాన్?
కిం వా ధనం నార్థిజనాయ యత్స్యాత్?
సా కిం క్రియా యా న హితానుబద్ధా?
కిం జీవితం సాధువిరోధి యద్వై? 3

[ఆర్తులను రక్షించనిది ఏమి పౌరుషం? అడిగిన వారికి ఇవ్వనిది ఏమి ధనం? హితంతో కూడనిది ఏమి పని? మంచివారితో విరోధించేది ఏమి బ్రతుకు?]

లఘువులు



# కుసుమాయుధుడి పెళ్ళి

చండీపురం అనే నగరంలో దేవస్వామి అనే బ్రాహ్మణుడు ఒకడు ఉండేవాడు. ఆయనకు కమలలోచన అనే కూతురు ఉండేది. ఆమె చాలా చక్కనిది. దేవస్వామికి కుసుమాయుధుడు అనే శిష్యుడు ఒకడు ఉండేవాడు. కుసుమాయుధుడూ, కమలలోచనా ఒకరి నొకరు రహస్యంగా ప్రేమించుకున్నారు.

ఇలా ఉండగా దేవస్వామి తన కుమార్తె వివాహం తలపెట్టి, ఆమెకు మరొక వరుణ్ణి నిశ్చయించాడు. ఆ సంగతి తెలియగానే కమలలోచన తన ప్రియుడైన కుసుమాయుధుడికి ఇలా కబురు పంపింది :

"నన్ను మా తండ్రి మరొకరికి ఇచ్చి పెళ్ళిచేయ నిశ్చయించాడు. నువే నాకు ఏనాడో నిర్ణయమైన భర్తవు గనక, ఏవిధంగా నైనా నన్ను మా ఇంటి నుంచి ఎత్తుకుపోయే మార్గం ఆలోచించు."

ఈ వార్త అందగానే కుసుమాయుధుడు ఆమెను ఫలాని సంకేత స్థలానికి రమ్మని కబురు చేసి, ఆ స్థలంలో తన సేవకుణ్ణి గుర్రంతో సహా ఏర్పాటు చేశాడు.

కమలలోచన అక్కడికి వచ్చి, ఆ గుర్రాన్ని ఎక్కింది. కాని కుసుమాయుధుడి సేవకుడు గుర్రాన్ని కుసుమాయుధుడి వద్దకు తీసుకుపోక మరొక మార్గాన నడిపించాడు. తెల్లవారుతూండగా వాళ్ళు మరేదో నగరాన్ని చేరారు.

"నీ యజమాని ఎక్కడ?" అని కమలలోచన సేవకుణ్ణి అడిగింది.

"నా యజమాని ఇంకెక్కడున్నాడు? అతనితో నీ కేంపని? మనిద్దరమూ పెళ్ళి చేసుకుందాం," అన్నాడు సేవకుడు.

కమలలోచన సమయస్ఫూర్తి గలది. ఆమె వాడితో, "ఆ మాట ముందే చెప్పావు కావేం? ఆలస్యం దేనికి? వెంటనే పెళ్ళి,

పెళ్ళికి కావలిసిన సంబారాలన్నీ తీసుకురా!" అన్నది.

ఆ మాట నమ్మి ఆ దుర్మార్గుడు కమలలోచనను గుర్రంతో సహా ఒక ఉద్యానంలో ఉంచి, పెళ్ళి సంబారాలు తీసుకు రావటానికి నగరంలోకి వెళ్ళాడు.

వాడు వెళ్ళిపోగానే కమలలోచన గుర్రంమీద ఎక్కి, ఒక వృద్ధుడైన మాలాకారుడి ఇంటికి వెళ్ళి, అతనితో తన సంగతి అంతా చెప్పుకున్నది. ఆ వృద్ధుడు ఆమె కథ విని, తన ఇంట ఉండనిచ్చాడు.

ఈ లోపల, పెళ్ళి సంబారాల కోసం వెళ్ళిన సేవకుడు తిరిగివచ్చి, ఉద్యానంలో కమలలోచన లేకపోయే సరికి, మోసం జరిగిందని గ్రహించి, తన యజమాని దగ్గిరికి తిరిగి వెళ్ళి, "అయ్యా, తమరు ఎంత అమాయకులు! ఆడవాళ్ళ మాయ తెలుసుకోలేక పోయారు. నన్ను మనుష లెవరో చూశారు. కొందరు నన్ను పట్టుకున్నారు, మిగిలినవాళ్ళు గుర్రాన్ని కాజేశారు. ఎలాగో ప్రాణాలతో వచ్చాను," అని చెప్పాడు.

అదంతా నిజమే కాబోలునని కుసుమాయుధుడు అనుకున్నాడు.

తరవాత కొద్దిరోజులకు కుసుమాయుధుడి తండ్రి కుసుమాయుధుడికి ఒక పిల్లను నిశ్చయించాడు. పెళ్ళివారు తరలిపోతూ, కమలలోచన ఉండిన నగరంలో, ఉద్యానవనంలోనే మజిలీచేశారు.

ఆ సమయంలో కమలలోచన అతన్ని చూసి, వెళ్ళి, తనకు ఆశ్రయ మిచ్చిన మాలాకారుడితో తాను చూసినది చెప్పింది. ఆ వృద్ధుడు వెళ్ళి కుసుమాయుధుణ్ణి కలుసుకుని, అతన్ని తన ఇంటికి తెచ్చాడు.

కుసుమాయుధుడు కమలలోచనను చూసి, జరిగిన సంగతి అంతా తెలుసుకుని, అప్పటి కప్పుడే ఆమెను పెళ్ళాడాడు. తరవాత కుసుమాయుధుడు తన సేవకుణ్ణి శిక్షించి, తన తండ్రి కుదిర్చిన కన్యను కూడా వివాహం చేసుకున్నాడు. ఎందుచేతనంటే, ఆమెను వివాహం చేసుకొనటానికి బయలుదేరక పోతే అతనికి కమలలోచన తిరిగి దొరికి ఉండేదికాదు.





# పితగత అయినా పేత

ఒక ఊళ్లో దాదాపు అందరూ మూఢులే. అలాటి ఊళ్ళోకి ఒక రోజు ఉదయం ఒక మరుగుజ్జువాడు అడుగు పెట్టి, మధ్యాన్నం దాటిన దాకా ఊరంతా తిరిగి, ఒక పాడు పెట్టిన ఇల్లు చూసి, ఆ ఇంటి ముందున్న అరుగు మీద కూర్చున్నాడు.

వాడికి ఎదురుగా ఒక ఖరీదైన ఇల్లు ఉన్నది. ఆ ఇంటి ముందుకు ఒక ఫకీరు వాడు వచ్చి నిలబడ్డాడు. వాడు మోకాళ్ళు దిగే నల్లని అంగీ ధరించాడు. వాడి నెత్తిన ఒక కుచ్చుటోపీ ఉన్నది వాడికి పిల్లి గడ్డమూ, చేతిలో బెత్తమూ ఉన్నాయి. బెత్తం పట్టుకునే చోట సింహాంతల గల పిడి ఉన్నది.

ఆ ఫకీరు ఖరీదైన ఇంటి గడప మీద బెత్తంతో ఒక్క చరుపు చరిచి, "ముందు ముష్టి పెట్టవే, ముదనష్టపు దానా!" అని కేక పెట్టాడు.

మరుక్షణం ఆ ఇంటి ఇల్లాలు గజ గజ వణుకుతూ వచ్చి, ఆ ఫకీరు అడిగినది మూటగట్టి ఇచ్చింది. ఫకీరు ఆ మూట తీసుకుని చకచకా వెళ్ళిపోయాడు.

ఇది కళ్ళారా చూస్తున్న మరుగుజ్జుకు ఆశ్చర్యం వేసింది. ఆ ఇల్లాలు ఫకీరును చూసి ఎందుకు అంత భయపడింది? అంత అమర్యాదగా ముష్టి అడిగితే ఎవరన్నా ముష్టి వేస్తారా?

ఈ సందేహం తీర్చుకునేటందుకని మరుగుజ్జువాడు, ఎదుటింటి ఇల్లాలు లోపలికి పోయి తలుపు మూసేలోపల ఆమె దగ్గిరికి వెళ్ళి, "అమ్మా, ఆ ఫకీరును తిట్టి పంపక ముష్టి ఎందుకు పెట్టావు? వాడికి అంత పొగరేం?" అని అడిగాడు.

ఆ ఇల్లాలు మరుగుజ్జు కేసి ఈసడింపుగా చూసి, "నీకు తెలియదా ఏం?" అంటూ లోపలికి పోబోయింది.

---

ఎం. కామేశ్వరరావు



"నిజంగా నాకు తెలియదు. తల్లీ! ఈ రోజే ఈ ఊరు వచ్చాను," అన్నాడు మరుగుజ్జు.

ఆమె మరుగుజ్జు కేసి తాపీగా చూసి, వాణ్ణి తాను ఎన్నడూ చూసి ఉండలేదన్నది రూఢి చేసుకుని, "ఏం చెప్పమంటావు, నాయనా? ఈ ఫకీరువెధవ మాకు పీడలా దాపరించాడు. వీడు ఎక్కడి నుంచి వచ్చాడో ఎవరికీ తెలియదు. వాడి చేతిలో ముష్టి బెత్తం చూశావుగా? దానితో ఏ గడప మీద కొట్టితే ఆ ఇంటి వాళ్ళు వాడు కోరిన ముష్టి వేసితీరాలి! అదేం చిత్రమో, ఆ బెత్తం దెబ్బ వినపడగానే మనసు ఏదో మాయ ఆవరించినట్టవుతుంది. మన స్పృహ మనకు ఉండదు. వాడు రోజూ ఏదో ఒక ఇంటి నుంచి తనకు కావలసినది- తీసుకుని, ఊరి చివర ఉన్న మామిడి తోపులోకి పోతాడు. వాడు ఉండేది అక్కడే," అని బాధతో చెప్పింది.

మరుగుజ్జువాడు ఇది విని ఆశ్చర్యపోతూ, "అయితే వాడు రోజూ ఇలా ముష్టి ఎత్తుకునే బదులు ఏకంగా ఏ ధనికుడినో మాయకు గురిచేసి, కావలిసిన డబ్బు పుచ్చుకుని, సుఖంగా కాలక్షేపం చెయ్యొచ్చుగా?" అన్నాడు.

"అది ముష్టి బెత్తమని చెప్పాను గద? తిండికి ముష్టెత్తినంతవరకే దాని ప్రభావం. డబ్బు అడిగితే దాని ప్రభావం ఉండదు," అన్నది ఆ ఇల్లాలు.

"ఊళ్ళో ఎవరూ ఆ బెత్తం లాగేసుకోవటానికి ప్రయత్నించ లేదూ?" అని మరుగుజ్జు అడిగాడు.

ఆమె భయంగా, "అమ్మో, అంత ధైర్యం ఎవరికున్నది? అదీగాక ఆ ఫకీరు దాన్ని చాలాజాగ్రత్తగా కాపాడుకుంటాడు," అన్నది.

"ఆ ముష్టి బెత్తాన్ని నేను సంపాదిస్తాను," అన్నాడు మరుగుజ్జు.

"ఈ మాట నాకు చెప్పి ఏంలాభం? సాయంకాలం కాలక్షేపానికి రామాలయంలో నలుగురూ కూడుతారు, వాళ్ళకు చెప్పు," అని ఆ ఇల్లాలు తలుపు వేసుకున్నది.

ఆ సాయంకాలం మరుగుజ్జువాడు రామాలయం వద్ద నలుగురినీ కలుసుకుని తాను తలపెట్టిన పని గురించి చెప్పి, "మీ సహకారం ఉంటే నేను ఈ పని చెయ్యగలను," అన్నాడు.



కొందరు మరుగుజ్జువాడి మాటలు ఖాతరు చెయ్యలేదు. కొద్ది మంది మటుకు, "నీకు కావలిసిన సహాయం ఏమిటి?" అని మరుగుజ్జును అడిగారు.

మరుగుజ్జు వాళ్ళకు చెప్పవలిసినది ఒకటికి రెండు సార్లు విడమర్చి చెప్పి, పాడుపడిన కొంపకు వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం మామిడి తోపులో ఫకీరు నిద్రలేచే సరికి, కాస్తదూరంలో మరుగుజ్జు నిద్రపోతూ కనిపించాడు. ఫకీరు ఆ మరుగుజ్జును పట్టించుకోక, తల కింద ఉన్న బెత్తాన్ని తీసుకుని, ఊరివైపు వెళ్ళిపోయాడు.

ఫకీరు తనకు కావలిసినది తెచ్చుకుని చెట్టు కింద కూర్చునే సరికి అపరాహ్నమయింది. వాడు మురుగుజ్జు కేసి చూస్తే మరుగుజ్జు చెట్టుకు చేరగిలబడి కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. వాడికి ఎదురుకుండా ఒక కుండ బోర్లించి ఉన్నది. దాని పక్కనే సన్నని ఇనప ఊచ ఒకటి ఉన్నది.

చెట్టు మీద కాకి అరిచిన అరుపుకు మరుగుజ్జువాడు ఉలిక్కిపడి కళ్ళుతెరిచి, ఫకీరు కేసి తినేసేలాగా చూసి, తన ముందు బోర్లించి ఉన్న కుండమీద ఇనప చువ్వతో మూడుసార్లు కొట్టి ఊరుకున్నాడు.

అంతలోనే ఊళ్ళోనుంచి కొందరు వచ్చి మరుగుజ్జు ముందు భోజనమూ, రకరకాల పంటకాలూ పెట్టారు. వాటిలోనుంచి మరుగుజ్జు తనకు కావలిసినవి మాత్రమే తీసుకుని ఊళ్ళోవాళ్ళను పంపేశాడు.

ఇదంతా చూసి ఫకీరు నిర్ఘాంతపోయాడు. తన ముష్టిబెత్తం కన్న ఈ కుండ చాలా సౌకర్యంగా ఉన్నది. ఎండలో పడి తాను ఊళ్ళోకి వెళ్ళి, తనకు కావలిసినది ఏ ఇంట దొరికేదీ ఊహించి, బెత్తం సహాయంతో తెచ్చుకోవాలి. మరుగుజ్జువాడి

దగ్గిరికి అన్ని రకాల ఆహారాలూ నడిచి వస్తున్నాయి. వాటినుంచి వాడు కావలిసినవి తీసుకుంటున్నాడు; కూర్చున్న చోటినుంచి కదలకుండా పొట్టపోసుకుంటున్నాడు.

ఫకీరు మరుగుజ్జువాడి దగ్గిరికి వచ్చి, "ఏం, తమ్ముడూ? కులాసాగా ఉన్నావా?" అని అడిగాడు.

"నా సంగతికేం గాని, అన్నయ్యా, నీ ఆరోగ్యం ఎలా ఉంటున్నది?" అని మరుగుజ్జు ఫకీరును పరామర్శించాడు.

"ఏం చెప్పమంటావు, తమ్ముడూ? వయసు ముంచుకొస్తున్నది. ముసలిముండా కొడుకును ఊళ్ళో నాలుగిళ్ళూ తిరిగే సరికి హైరాన పడిపోతున్నాను," అన్నాడు ఫకీరు కుండ కేసి ఆశగాచూస్తూ.

మరుగుజ్జు ఏమీ అనలేదు. ఫకీరుకు ఇంకా ఆ కుండలో పూర్తి నమ్మకం కలగలేదు; అందుచేత వాడు దాని ప్రస్తావన తీసుకురాలేదు.

కాని ఆ రాత్రి కూడా మరుగుజ్జువాడు కుండ మీద ఊచతో మూడుసార్లు కొట్టి ఆహారం తెప్పించుకోవటం చూసి ఫకీరు, "ఏం, తమ్ముడూ? నువ్వు కుర్రాడివి. నాలుగు వీధులూ తిరగ గలవు. నా బెత్తం తీసుకుని నీ కుండ ఇస్తావా?" అని అడిగాడు.

మరుగుజ్జువాడు కాస్సేపు సంకోచిస్తున్నట్టు నటించి, "మరొకరికైతే ఇవ్వకపోదును; ఏదో వరసకలిపావు కదా అని నీకిస్తున్నాను," అంటూ ఫకీరు బెత్తాన్ని తీసుకుని వాడికి తన కుండ ఇచ్చాడు.

తెల్లవారి నిద్ర లేచి చూసేసరికి ఫకీరుకు మరుగుజ్జు కనిపించ లేదు. వాడు మిట్ట మధ్యాన్నం దాకా తోపులోనే కూర్చుని, ఇనప ఊచతో కుండ మీద మూడుసార్లు కొట్టాడు. ఎంతసేపు చూసినా ఎవరూ రాలేదు. విసుగెత్తి కుండను బాదితే అది కాస్తా పగిలిపోయింది. ఫకీరు ముష్టెత్తుకుందామని ఊళ్ళోకి వెళ్ళితే, ఊళ్ళోవాళ్ళు వాణ్ణి కుక్కను తరిమినట్టు తరిమారు.

ఫకీరు ఆ గ్రామం వదిలిపెట్టి వెళ్ళిపోయాడు. ఊళ్ళోవాళ్ళు పరమానందం చెందారు.





# యక్షపర్వతం

## 12

[బందిపోట్ల నాయకుడైన సమరబాహును రక్షించేందుకు బయలుదేరిన ఖడ్గ జీవదత్తులకు అరణ్యంలో ఒక చోట బానిసలతో పనిచేయిస్తున్న ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాళ్ళు కనిపించారు. ఖడ్గ జీవదత్తులు వాళ్ళను సమీపించ బోయేంతలో, ఒక చోట ఎత్తుగా లేస్తున్న పొగ కనిపించింది. ఖడ్గ జీవదత్తులు అటుకేసి వెళ్ళారు. తరవాత—]

ఖడ్గ జీవదత్తులు పొగలేస్తున్న చెట్ల దగ్గిరకు పోయి ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి, ఎలుగు బంటు ముఠా ఏమి చేస్తున్నదో చూడ సాగారు. పొగ లేస్తున్న చోటుకు పక్కనే భూమిలోకి చొచ్చుకు పోయిన బిలం ఒకటి వున్నది. అక్కడ ఎలుగుబంటు వాళ్ళు తాము అరణ్యంలో చంపి తెచ్చిన జంతువులను మంటల్లోవేసి కాల్చసాగారు. కొందరు తప్పెట్లూ, డప్పులూ వాయిస్తూ, ఎలుగు బంట్లతో నాట్యం ఆడిస్తూ వినోదించటం ప్రారంభించారు.

ఖడ్గ జీవదత్తులు ఆ ప్రదేశాన్ని చేరేసరికే సమరబాహును ఎలుగుబంటు ముఠా నాయకుడు బిలం లోకి తీసుకుపోవటంతో, అతడు ఖడ్గ జీవదత్తులకు కనిపించలేదు. కాని, ఎత్తుగావున్న చెట్లకొమ్మల్లో వున్నందువల్ల వాళ్ళకు పైనుంచి బిలం లోపలికి వున్న రాతి మెట్లు కంటబడినై.



"జీవా, ఈ అడవి జాతివాళ్ళ నివాస స్థానం ఆ కనబడే బిలంలాగా వున్నది. బహుశా ఆ బిలంలోంచి అరణ్యంలోకి రహస్యమార్గం ఏదైనా వుండినా వుండొచ్చు. ఎదీ, వీళ్ళు సమరబాహును కాల్చుకు తింటున్న సూచనలేవీ కనిపించటం లేదే!" అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు ఆ ప్రదేశాన్ని కొంచెం సేపు పరీక్షగా చూసి, "ఈ ఎలుగ్గొడ్డు మనుషులు నరభక్షకులని స్వర్ణాచారి అనవసరంగా భయపడ్డాడని నాకు తోస్తున్నది. వీళ్ళు అరణ్యంలో వ్యవసాయం చేస్తున్న తీరు చూస్తే, వీళ్ళు దొరికిన మనుషులను బానిసలుగా ఉపయోగించుకునే జాతిగా కనిపిస్తున్నారు. సమరబాహునూ, అతడి అనుచరుణ్ణీ వీళ్ళు ప్రాణాలతో లోపలికి తీసుకుపోయి వుండాలి. వీళ్ళు నరమాంస భక్షకులు మాత్రం కాదు," అన్నాడు.

ఖడ్గవర్మకు కూడా అలాంటి అభిప్రాయమే కలిగింది. అతడు మరి కాస్త ఎత్తుగావున్న చెట్టుకొమ్మ మీదికి ఎక్కి, "వీళ్ళు కాలుస్తున్న వాటిల్లో మనుషుల్లేరు. అన్నీ, వాళ్ళు అరణ్యంలో వేటాడి తెచ్చిన జంతువులే!" అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు యిలా మాట్లాడుకుంటున్న సమయంలో ఎలుగుబంటు ముఠా నాయకుడు సమరబాహుణ్ణీ అతడి అనుచరుణ్ణీ తీసుకుపోయి వాళ్ళ గురువు గారి ముందు నిలబెట్టి, వంగి నమస్కరించి, "గురుభల్లూకా! ఈ ఇద్దరూ నాకు అరణ్యంలో దొరికారు. చూడబోతే ఇద్దరూ పౌరుషవంతుల్లానే కనిపిస్తున్నారు. మాకు ఒక పట్టాన లొంగలేదు," అని చెప్పాడు.

గురుభల్లూకుడు సభామంటపంలా వున్న ఒక గుండ్రని సమతల ప్రదేశంలో ఎత్తుగా వున్న ఒక రాతి ఆసనం మీద కూర్చుని వున్నాడు. అతడు ముఖం మాత్రం కనిపించకుండా ఒక ఎలుగుబంటి తల తగిలించుకున్నాడు. ఆసనానికి రెండు పక్కలా రెండు భయంకరమైన తోడేళ్ళు నిలబడి, నోళ్ళు తెరిచి బందీల కేసి చూస్తు

న్నవి. ఈ బెలు ధరించిన కొందరు సభా మంటపంలో అక్కడక్కడ నిలబడి వున్నారు.

సమరబాహుడికీ, అతడి అనుచరుడికీ యిక తమ చావు క్షణాలలో వున్నదనిపించింది. బహుశా, యీ ఆదిమవాసులు తమ మీదికి తోడేళ్ళను ఉసికొల్పి, వాటిచేత తమను భయంకర మరణం పాలు చేయిస్తారని వాళ్ళు భయపడ్డారు.

ఎలుగుబంటు ముఠా నాయకుడు చెప్పిన మాటలు విని గురుభల్లూకుడు తలాడిస్తూ కొంచెం సేపు వూరుకుని తరవాత సమరబాహు కేసి తల ఎత్తి చూస్తూ, "ఒరే, నీ వేషం చూస్తూంటే నువ్వేదో పట్నవాసం మనిషిలా కనిపిస్తున్నావు. నీకి అరణ్యంలో ఏం పనిపడి వచ్చావు?" అని అడిగాడు.

సమరబాహు ఒక్కక్షణం ఏం చెప్పాలా అని తటపటాయించి, "నేను పట్నవాసం వాణ్ణి కాను. సింధు ఎడారుల నుంచి యీ ప్రాంతాలకు వచ్చాను. నాకు వందల సంఖ్యలో అనుచరులున్నారు. వాళ్ళకు నేను బందీ అయిన సంగతి తెలిసి తీరుతుంది. అప్పుడు వాళ్ళు నిన్నూ, నీ బిలగృహాన్నీ సర్వనాశనం చేస్తారు." అన్నాడు భీకరమైన కంఠస్వరంతో.

"ఒరే, నీ కంచుకంఠం, నీ పౌరుష వాక్కులూ కూడా మెచ్చదగినవే!" అంటూ




గురుభల్లూకుడు పెద్దగా నవ్వి, "నువ్వు చెప్పే, ఆ నీ అనుచరులు నా బిలదుర్గాన్ని సమీపించే లోపలే, నా భల్లూక భటులు వాళ్ళను తోడేళ్ళగుంపుకు ఆహారంగా వేసేస్తారు. నాతో బింకాలు పలకకు. నిన్నూ, నీ వెంటవున్న వాణ్ణీ ఎలా లొంగదీసి, నా తతిమ్మా బానిసలతో పాటు పొలం పనులు చేయించాలో నాకు తెలుసు." అన్నాడు.

గురుభల్లూకుడు మాట ముగించేలోపలే వాడి అనుచరు లిద్దరు అక్కడికి పరుగు పరుగున వచ్చి, సమరబాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ చూసి ఆగిపోయారు. గురుభల్లూకుడు వాళ్ళను, "ఏమిటి సంగతి?" అని ప్రశ్నించాడు.



వచ్చిన వాళ్ళిద్దరూ ఆ ప్రశ్న విని సమర బాహు కేసి చూడసాగారు. గురుభల్లూకుడు విసుగ్గా తలాడించి, "ఎలాంటి రహస్య విషయం విన్నా, యీ బందీలిద్దరూ మనకు చేయగలిగిన హాని ఏమీ లేదు. వాళ్ళి ద్దర్నీ యిప్పుడే తోడేళ్ళబండ దగ్గిరకు పంపుతున్నాను," అన్నాడు.

"గురుభల్లూకా, యిది చాలా ముఖ్య మైన సంగతి. తమరొక్కరే వినదగింది," అంటూ ఇద్దరూ తమ గురువును సమీపించి రహస్యంగా అతడితో ఏమో చెప్పారు.

గురుభల్లూకుడు ఒక్కక్షణం ఆశ్చర్య పోయి, సమరబాహును పట్టుకొచ్చిన ఎలుగు బంటు ముఠా నాయకుడి కేసి కోపంగా చూస్తూ, "నీ తెలివి తేటలు యిలా అఘో రిస్తున్నవన్న మాట!" అని ఒక క్షణం ఆగి, "సరే, యీ బంధితు లిద్దర్నీ తోడేళ్ళ బండ దగ్గిర వదిలిరండి. ముందు వాళ్ళ చేతికట్లు విప్పి, చెరొక ఈటె యివ్వండి," అన్నాడు.

గురుభల్లూకుడి ఆజ్ఞకాగానే అతడి అను చరులు సమరబాహుడి కట్లూ, అతడి అను చరుడి కట్లూ విప్పి, వాళ్ళ చేతికి ఈటె లిచ్చి, "ఇక నడవండి!" అంటూ వాళ్ళను అక్కణ్ణించి సభామంటపం పక్కనే వున్న ఒక సొరంగ మార్గంలోకి తీసుకుపోయారు.

వాళ్ళు అటు వెళ్ళగానే గురుభల్లూకుడు తన అనుచరుల కేసి తిరిగి, "ఆ కొత్త మనుషులు మన బిలరహస్యం తెలుసుకునే వుంటారు. ఏమైనా వాళ్ళను ఒక కంట కనిపెట్టి వుండండి. వాళ్ళు యీ ప్రదేశా న్నుంచి పారిపోవాలని ప్రయత్నం చేస్తే మటుకు ప్రాణాలతో పట్టుకుని యిక్కడికి తీసుకురండి," అని చెప్పాడు.

"చిత్తం, గురుభల్లూకా!" అని అతడి అనుచరులు పదీ పన్నెండు మంది వంగి నమస్కరించి సభామంటపం నుంచి బిలం పైకివున్న మెట్ల కేసి వెళ్ళిపోయారు:

చెట్టుకొమ్మల్లో వున్న ఖడ్గ జీవదత్తులకు పగటివేళ ఎలుగుబంటివాళ్ళ బిలాన్ని సమీ పించటం సాధ్యం కాదని అర్థమైపోయింది.

ఎలుగుబంటు వాళ్ళు బిలం ముందు ఎలుగుబంట్లతో నాట్యాలు చేస్తూ, వేటాడి తెచ్చిన జంతువులను కాల్చుకు తింటు న్నారు. అసరికి మిట్టమధ్యాన్నమై, ఎండా వేడీ అరణ్యాన్ని భగ్గుమనిపిస్తున్నవి. జీవ దత్తుడు చెట్టు మీది నుంచి కిందికి దిగుతూ ఖడ్గవర్మతో, "ఖడ్గా, మనం చూడవలసిన దంతా చూశాం. ఇక యిక్కడ కాలయాపన చేయటం వృథా. ఆకలి మండుతున్నది. యిక్కడ దాపుల నున్న ఏ కొలనులోనైనా స్నానం చేసి పళ్ళూఫలాలూ తిని, చీకటి పడిన తర్వాత బిలంలో ప్రవేశించే ఉపాయం ఏదైనా ఆలోచిద్దాం." అన్నాడు.

ఖడ్గవర్మ మారు మాట్లాడకుండా జీవ దత్తుడితో పాటు చెట్టు దిగాడు. ఇద్దరూ నీటి కోసం వెతుక్కుంటూపోయి, త్వరలోనే ఒక పెద్ద కొలనును సమీపించారు. ఆ కొలను చుట్టూ గుబురుపొదలూ, ఎత్తయిన వృక్షాలూ వున్నవి. అరణ్యమృగాలు నీటి కోసం వచ్చి పోయే దారులు కొన్ని ఖడ్గ జీవదత్తులకు కనిపించినై.

"ఖడ్గా, మనం త్వరగా స్నానాలు ముగించి యిక్కణ్ణించి దూరంగా పోవటం మంచిది. ఈ కొలనును అడవి జంతువులూ, ఎలుగుబంటు ముఠా వాళ్ళూ కూడా నీటి కోసం ఉపయోగించు కుంటున్నట్టున్నది." అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు యిలా అంటూండగానే అల్లంత దూరంలో వున్న పొదల్లో నుంచి నాలుగైదు అడవికోళ్ళు గగ్గోలుగా అరుస్తూ





బయటికి వచ్చినై. వాటిని చూస్తూనే ఖడ్గవర్మ "అడవికోడి మాంసం తిని చాలా రోజులైంది!" అంటూ వాటి కేసి బాణం ఎక్కుపెట్టి వదిలాడు.

బాణం రివ్వుమంటూ పోయింది. అది అడవి కోళ్ళలో దేనికీ తగలలేదు; అవి అరుస్తూ ఎగిరిపోయినై. కాని ఆ మరుక్షణానే, "గురుభల్లూకా! చస్తిని! చస్తిని!" అన్న మనిషి కేక వినిపించింది.

ఆ కేక వింటూనే ఖడ్గ జీవత్తులు ఒక క్షణ కాలం నివ్వెరపోయారు. "ఖడ్గా, ఏమిటీ వింత? నువ్వొదిలిన బాణం అడవి కోళ్ళను కాక, పొదలో దాగి వున్న ఎవడో మనిషికి తగిలినట్టుంది. గురుభల్లూకు డెవడు?" అంటూ జీవదత్తుడు పొదల కేసి పరిగెత్తాడు. ఖడ్గవర్మ కూడా అతణ్ణి అనుసరించాడు.

ఖడ్గ జీవదత్తులు చావుకేక వినబడ్డ పొదలను సమీపించేంతలో ఎలుగుబంటి చర్మాలు ధరించన వాడొకడు వాటిల్లో గిల గిల తన్నుకుంటున్నాడు. ఖడ్గవర్మ వదిలిన బాణం వాడి గుండెల్లో దిగి వున్నది.

జీవదత్తుడు వాణ్ణి సమీపించి, "ఒరే బాబూ, నువ్వెవడివో తెలుస్తూనేవుంది. కాని మేం నిన్ను చంపాలని బాణం కొట్టలేదు. ఈ పొదల్లో ఏం చేస్తున్నావు?" అన్నాడు.

గాయపడిన వాడికి యీ మాటలు విన బడినవి కాని, వాడు జవాబిచ్చేస్థితిలో లేడు. వాడు పొదల్లో అటూ యిటూ పొర్లుతూ, "గురుభల్లూకా! గురుభల్లూకా!" అంటూ గొణగసాగాడు.

"జీవా, వీడు మరొకటీ రెండు క్షణాల కన్న బతకడు. నా అనుమానం ఏమిటంటే, వీడు అడవి కోళ్ళను పట్టుకునేందుకు పొదల్లో పొంచి వున్నాడా లేక మన మీద వేగుచేస్తున్నాడా అని!" అన్నాడు ఖడ్గవర్మ.

"ఊహుఁ, నీ ప్రశ్నకు జవాబివ్వవలసిన వాడి ఆత్మ కాస్తా గురుభల్లూకుడిలో ఐక్యం అయినట్టుంది!" అంటూ జీవదత్తుడు వెనుదిరిగాడు.

ఖడ్గవర్మ ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాడి కేసి పరీక్షగా చూసి, వాడిలో

ఎలాంటి చలనం లేకపోవటంతో, మరణించాడని గ్రహించి, తానూ జీవదత్తుడితో పాటు పొదల్లో నుంచి తిరిగి కొలను ఒడ్డుకు వచ్చాడు.

ఆ తరవాత ఇద్దరూ కొలనులో స్నానం చేసి, ఆ పక్కలనే వున్న వృక్షాల నుంచి పళ్ళుకోసుకు తిని, ఒక చెట్టు నీడన సూర్యాస్తమయకాలం వరకూ విశ్రాంతి తీసుకున్నారు. ఖడ్గ జీవదత్తు లిద్దరికీ బిలంలో వున్న వాళ్ళు తమను ఆ ప్రాంతాల వున్నట్టు తెలుసుకున్నారన్న అనుమానం కలిగింది. అయినా, సమరబాహుణ్ణి బంధ విముక్తుణ్ణి చేయకుండా వెనక్కు తిరిగి పోవటం న్యాయం కాదని యిద్దరూ నిర్ణయించుకున్నారు.

సూర్యాస్తమయమై కొంత సేపటికి అరణ్యం అంతా చీకట్లు కమ్మినై. ఖడ్గ జీవదత్తులు బిలంకేసి బయలుదేరారు. ఎవరైనా తమను అనుసరించి వస్తున్నారేమో అన్న సంశయంతో వాళ్లు చుట్టూ జాగ్రత్తగా కలయ చూస్తూ, కొద్ది సేపటికి బిలాన్ని సమీపించారు. బిలం పైన గాని, దిగువకున్న మెట్ల వద్దకాని కాపలా వాళ్ళెవరూ లేరు.

"ఖడ్గా, పరిస్థితి అర్థమైంది గదా! ఈ బిలంలోవున్న ఎలుగ్గొడ్డు మనుషులు మనను చాలా తెలివిగా బంధించ బోతున్నామని అనుకుంటున్నారు. మనం కావాలనే వాళ్ళకు బందీలుగా చిక్కుతున్నామనీ... ఆ తరవాత తమ ముఠా అంతా సర్వనాశనం కాబోతున్నదనీ, పాపం, వాళ్ళెరగరు!"



అన్నాడు జీవదత్తుడు, బిలంలోపలికున్న మెట్లుదిగుతూ.

ఖడ్గవర్మ కూడా అతడి వెనకగా మెట్లు దిగసాగాడు. ఇద్దరూ ఆ విధంగా కొన్ని మెట్లుదిగి కొంచెం చీకటిగావున్న మలుపును చేరేంతలో, పదీ పన్నెండుమంది ఎలుగ్గొడ్డు వాళ్ళు, చప్పున చీకట్లో నుంచి బయిటికి వస్తూ, ఈటెలెత్తి, "ఆగండి! పారిపో జూశారో, మా ఈటెలకు ఎరచేస్తాం!" అన్నారు.

జీవదత్తుడు వాళ్ళను చూసి నవ్వుతూ, "ఒరే, మమ్మల్ని ప్రాణంలేని ఈటెలకు ఎరగా ఎందుకేస్తారు? తోడేళ్ళకు వెయ్యండి. ఆ వేసేముందు మీ గురుభల్లూకుడి దర్శనం యిప్పించండి," అన్నాడు.

ఎలుగ్గొడ్డు వాళ్ళల్లో ఒకడు చిన్న గొంతుతో, "అంత పెద్దగా మాట్లాడకండి! గురుభల్లూకుడు తన ఇష్టదేవత అయిన వృకేశ్వరి పూజలో వున్నాడు. మిమ్మల్ని ముందు తోడేళ్ళబండ దగ్గిర వదులుతాం. అక్కణ్ణించి బతికి రాగలిగితే, అప్పుడు మీకు గురుభల్లూకుడి దర్శనం తప్పక అవుతుంది," అన్నాడు.

"మహాప్రసాదం! ఆ తోడేళ్ళ బండ ఎక్కడ?" అన్నాడు జీవదత్తుడు.

"తొందర పడకండి, అక్కడికే వెళు తున్నాం!" అంటూ ఎలుగ్గొడ్డు మనుషులు ఖడ్గ జీవదత్తులకు వెనకా, ముందూవుండి ఒక సొరంగంలోకి దారి తీశారు. దూరాన ఎక్కడినుంచో తోడేళ్ళ అరుపులూ, భీతి గొన్న మనుషుల కేకలూ ఆ సొరంగ మార్గంలో ప్రతిధ్వనించసాగినై.

"ఖడ్గా, ఆ కంఠస్వరాలు సమరబాహూ, అతడి అనుచరుడివై వుంటవి! తోడేళ్ళు వాళ్ళను చంపుకుతినే ప్రయత్నం చేయటం లేదు గదా?" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ ఏదో జవాబివ్వబోయేంతలో, ఎలుగుబంటువాళ్ళల్లో ఒకడు ఈటె ఝళి పిస్తూ, "నిశ్శబ్దం! ఒకటి రెండు క్షణాల్లో ఆ తోడేళ్ళు చేస్తున్న దేమిటో మీ కళ్ళతోనే చూస్తారు!" అన్నాడు.

—(ఇంకావుంది)





# నిద్రపోయిన రాక్షసుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్ను ఈ పనికి పురికొల్పినవారు నిన్ను మెచ్చుకుంటున్నారో, తిట్టుకుంటున్నారో నీకు తెలియదనుకుంటాను. ప్రజలకు ఒక నిశ్చితాభిప్రాయం ఉండదనటానికి నీకు శంఖుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కొన్ని వేల సంవత్సరాల క్రితం గోదావరీ తీరాన గల పర్వతారణ్యాలలో ఒక రాక్షసి ఉండేది. దానికి శంఖుడని ఒక కొడుకు ఉండేవాడు. వాడు పెద్దవాడయాక వాడి తల్లి, "నాయనా, నేను నా జీవితమంతా అరణ్యంలోనే ఆహారం సంపాదించుకుని బతికాను. ప్రజలు నా జోలికి రాలేదు,

## బేతాళ కథలు



నేను ప్రజలజోలికి పోలేదు. నాకు వయసు తీరిపోయింది. నేను వెళ్ళి తపస్సు చేసుకుని శివసాయుజ్యం పొందుతాను. నువు ఈ అరణ్యాల మీద ఆధారపడి బతకలేవు. అందుచేత మనుషులుండే ప్రాంతానికి వెళ్ళి, నయానో భయానో నీ పొట్టపోసుకో," అని హితం చెప్పింది.

తల్లి తపస్సుకు వెళ్ళిపోగానే శంఖుడు అరణ్యం నుంచి బయలుదేరి, కొండల మీదిగా నడవసాగాడు. వాడు ఒక కొండ మీద నిలబడి, కొండ అడుగున ఉన్న ఒక నగరాన్ని చూశాడు. అరణ్యంలాగా ఆ నగరం వాడికి ఆకర్షవంతంగా లేదు. కాని అక్కడ మనుషులున్నట్టు వాడు చూశాడు. వాళ్ళ మధ్యకు వెళ్ళి తన బతుకుతెరువు చూసుకోమని తల్లి చెప్పింది. ఆ పని తరవాత నింపాదిగా చూడవచ్చుననుకుని, వాడు నిలబడిన చోటికి సమీపంలో గల ఒక గుహలో విశ్రాంతి తీసుకుందామని నిశ్చయించాడు. అది చాలా లోతైన గుహ. అందులో చాలా చల్లగా ఉన్నది. శంఖుడు అక్కడే పడుకుని నిద్రపోయాడు.

శంఖుడు కొండపైన నిలబడి నగరం కేసి వింతగా చూస్తూ ఉండిన సమయంలో నగరం వెలపల పనులు చేసుకుంటున్న వారు కొందరు, వాణ్ణి చూసి, "అమ్మో, రాక్షసుడు!" అని అరుస్తూ నగరంలోకి పరిగెత్తి జనాన్ని హెచ్చరించారు. తరవాత వీధుల్లోనూ, మేడల మీదా నిలబడి కొన్ని వేల మంది ఆ రాక్షసుణ్ణి చూశారు.

ఆ రోజు నగరంలో పుట్టిన సంచలనం అంతా ఇంతా కాదు. వాడు జనాన్ని విరుచుకు తినటానికే వచ్చాడని అందరూ నమ్మారు. ఆరు నెలల తరవాత నగరంలో ఒక మనిషిగాని, పశువుగాని ప్రాణాలతో మిగలదన్నారు. నగరాన్ని ఏలే రాజు ప్రజలందరికీ కత్తులూ, ఈటెలూ ఇప్పించాడు.

ఆ రాత్రి ఎవరూ నిద్రపోలేదు. ఎవరూ దీపాలు వెలిగించలేదు. చాలామంది రాత్రి అంతా వీధుల్లోనే తిరిగారు. అందరి కళ్ళూ కొండమీదనే ఉండిపోయాయి.

కాని రాక్షసుడు నగరం మీదికి రాలేదు. రోజులు గడిచాయి. రాక్షసుడి జాడ లేదు. ప్రజలలో కలిగిన భీతి కొంచెం కొంచెం తగ్గింది. ఆ రాక్షసుడు ఇంకెటో వెళ్ళి ఉంటాడని కొందరు అన్నారు. గుండె నిబ్బరం గలవాళ్లు పగటి పనులు మామూలు గానే చేసుకోసాగారు. పొలం పనులు సాగాయి. పశువులను బీళ్ళలో మళ్ళీ మేప నారంభించారు. అయితే రాక్షసులకు రాత్రి వేళ బలం హెచ్చు గనగ రాత్రులప్పుడు నగరంలో వాళ్లు జాగ్రత్తగానే ఉంటున్నారు.

ఎన్ని రోజులు గడిచినా రాక్షసుడు నగర వాసులకు తిరిగి కనబడలేదు. కొద్దిమంది సాహసికులైన యువకులు గండ్రగొడ్డళ్ళు తీసుకుని కొండ ఎక్కి వెళ్ళారు. వారికి గుహ కనబడింది. అందులో నుంచి భయం కరంగా గురక వినిపిస్తున్నది. సాహసికులు చప్పున కొండ దిగి వచ్చి, "రాక్షసుడు ఎక్కడికీ పోలేదు. వాడు గుహలో నిద్ర పోతున్నాడు!" అని చెప్పారు.

"రాక్షసులకు నిద్ర బలం! నిద్ర లేచాక ఈ రాక్షసుణ్ణి ఎవరూ జయించలేరు," అన్నారు నగరంలోని పండితులు.

రాజుగారు తన మంత్రులను పిలిచి, "రాక్షసుడు గుహలో నిద్రపోతున్నట్టు వార్త వచ్చింది. వాడు ఆ గుహలోనే నిద్రలో ఉండగా వాణ్ణి చంపటం తేలికేమో ఆలో చించండి. వాడు నిద్రలేస్తే వాణ్ణి గెలవటం సాధ్యం కాదని జ్ఞానులు చెబుతున్నారు," అన్నాడు.





"వాడు ఎప్పటికైనా నగరానికి ప్రమాదమే గనక వాణ్ణి వీలున్నప్పుడే హతమార్చటం మంచిది." అన్నారు కొందరు మంత్రులు.

కాని ప్రధానమంత్రి అందుకు ఒప్పుకోలేదు. ఆయన ఇలా అన్నాడు:

"మహారాజా, మనం పులులూ, సింహాలూ, మదపుటేనుగులూ లాటి ఘాతుకమృగాలను మచ్చిక చేస్తున్నాం. ఈ రాక్షసుణ్ణి మచ్చిక చెయ్యటం అసాధ్యం కాదు. వీడు మహా తింటే వందమంది తినే తిండి తినేను. కాని వీడు కొన్ని వేలమంది సైనికుల పెట్టు. రాక్షసుడికి కావలసినది తిండి. వాడికి కుట్రలూ కుహకాలూ తెలియవు. మంచి చేసుకుంటే మనిషికన్న విశ్వాసంగా ఉంటాడు రాక్షసుడు. వాణ్ణి నిద్ర లేవనివ్వండి. మంచి చేసుకుందాం. ఆ తరవాత మనకు శత్రుభయం అనేది ఉండదు. వాణ్ణి మనం పోషించి, వాడి చేత ఏనుగులాగా పని చేయించుకుందాం. అందువల్ల మనకు లాభమేగాని నష్టం ఉండదు."

ఈ ఆలోచన రాజుకూ, మంత్రులకూ నచ్చింది. ప్రజలు కూడా రాక్షసుణ్ణి గురించి అభిమానంతో మాట్లాడసాగారు.

తరవాత కొద్ది కాలానికి ఆ ప్రాంతంలో క్షామం వచ్చింది. వానలు లేవు.

"ఇప్పుడైనా రాక్షసుడు కొంత దిగి రాగూడదా? వాడు గోదావరిని మన నగరం పక్కగా మళ్ళించగలడు! పాతాళగంగను పైకి తేగలడు. మనకు ఒక రాక్షసుడు ఉన్నాడన్న మాటేగాని అందువల్ల లాభం కలగకపోవటం శోచనీయం!" అన్నారు నగరంలోని పెద్దలు.

క్షామం వెంటనే బందిపోటు దొంగల బెడద వచ్చిపడింది. వాళ్ళు వందల సంఖ్యలో ఎక్కడెక్కడి నుంచో వచ్చిపడి, అడ్డపడిన వాళ్ళను హతమార్చి, అసలే చాలీ చాలకుండా ఉన్న ధాన్యాన్నీ, బక్కచిక్కి ఉన్న పశువులనూ కొల్లగొట్టసాగారు.

"రాక్షసుణ్ణి పిలుచుకు రావటానికి ఇదే సమయం! గుండె నిబ్బరం ఉన్న వాళ్ళు

గుహకు వెళ్ళి, రాక్షసుణ్ణి లేపుకురండి," అన్నారు పెద్దలు.

"అమ్మో! నిద్రలో ఉన్న రాక్షసుణ్ణి లేపటం చాలా ప్రమాదం. వాడు ఆ నిద్ర మత్తులో మనం చెప్పేది వినిపించుకోడు. కనిపించిన వాళ్ళందరినీ కసి కొద్దీ హత మార్చుతాడు!" అని యువకులు భయపడ్డారు.

ఆ మరుసటి ఏడు శత్రురాజులు వచ్చి నగరం మీద దాడిచేశారు. ఇక ఉపేక్షించి లాభం లేదని నగరపు సేనాధిపతి కొంత మంది సైనికులను వెంట బెట్టుకుని కొండ ఎక్కాడు. వాళ్ళు రాక్షసుడి గుహ కనుక్కొని లోపలికి తొంగి చూశారు. గుహలో రాక్షసుడు లేడు. వాడు ఎప్పుడో అందులో నుంచి వెళ్ళిపోయాడు. నగరం శత్రు వశమయింది. నగరంలోని ప్రజలు రాక్షసుడు తమ మధ్యకు రానందుకు ఛీత్కారాలుగా తిట్టి, శాపనార్థాలు పెట్టుకున్నారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నగర ప్రజలు రాక్షసుణ్ణి తలుచుకుని భయపడ్డారు, సంతోషించారు, తిట్టారు, దీవించారు. వాళ్ళకు ఆ రాక్షసుడి గురించి అసలైన అభిప్రాయం ఏమిటి? వాళ్ళకు వాడి పట్ల ఆదరాభిమానాలు ఉన్నట్టా? లేనట్టా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోయింది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రజలకూ, రాక్షసుడికీ మధ్య ఆదరాభిమానాల సమస్య లేదు. ప్రజలకు సంబంధించినంత వరకు ఆ రాక్షసుడు ఒక మహాశక్తి. శక్తిని ఎవరూ ఆదరించి ప్రేమించరు. అది తమకు అపాయం కలిగిస్తుందనుకున్నప్పుడు దాన్ని చూసి భయపడతారు; దానివల్ల లాభం ఉందనుకున్నప్పుడు ఆశపడతారు; అది సమయానికి అదుకోనప్పుడు తిట్టి పోస్తారు; అది అదృశ్యమైనప్పుడు దాన్ని తూలనాడుతారు కూడా," అన్నాడు.

ఈ విధంగా రాజుకు మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# అవివేకి

అరబ్బీ వర్తకులు కోసలదేశపు రాజు వద్దకు శ్రేష్ఠమైన గుర్రాలను తెచ్చి చూపారు. రాజు వాటిని మెచ్చుకుని, హెచ్చు వెల ఇచ్చి వాటిని కొని, మరికొన్ని గుర్రాలను తీసుకు రమ్మని వారికి ముందుగానే రెండు లక్షల రూపాయలు ఇచ్చి పంపేశాడు.

ఇది జరిగిన కొన్ని రోజుల అనంతరం ఆ రాజు తన మంత్రితో సరదాకు రాజ్యంలోని నూరు మంది అవివేకుల పట్టీ తయారు చెయ్యమన్నాడు.

మంత్రి పట్టీ తయారు చేసి రాజుకు ఇచ్చాడు. దానిలో మొదటి పేరు రాజుదే!

రాజు ఆశ్చర్యపడి, "ఈ పట్టీలో నా పేరు దేనికి చేరింది?" అని అడిగాడు.

"మహా ప్రభూ, ముక్కూ మొగమూ తెలీని అరబ్బీ వర్తకులకు రెండు లక్షలు ఇచ్చి పంపెయ్యటం కన్న అవివేకం ఏమున్నా ఉంటుందా?" అన్నాడు మంత్రి.

"వారు తిరిగి గుర్రాలతో వస్తేనే?" అన్నాడు రాజు.

"అప్పుడు తమ పేరు కొట్టేసి ఆ స్థానంలో వాళ్ళ పేర్లు రాస్తాను," అన్నాడు మంత్రి.

—కె. వై. వెంకటేశ్వర్లు.






# కలిస్తేనే స్నేహం

ఒక గ్రామంలో నాగప్పా, సిద్దప్పా అని ఇద్దరు స్నేహితులు ఉండేవారు. వాళ్ళ స్నేహం నిశ్చలంగా ఉండేది కాదు. ఒకప్పుడు పెరిగేది, ఒకప్పుడు తరిగేది. తమ స్నేహం ఇలా అపకతవకగా ఉండటం వారికే నచ్చేది కాదు, కాని అది నిలకడగా ఉండాలంటే ఏం చెయ్యాలో వారికి తెలియ లేదు. చివరకు వాళ్ళు ఒక నిర్ణయానికి వచ్చారు—తమ మధ్య ఎలాటి అరమరి కలూ లేకుండా, తమ స్నేహాన్ని పటిష్ఠంగా ఉంచుకోవటానికి ఇద్దరూ కలిసి దేవుడి ముందు ప్రమాణం చేద్దామనుకున్నారు.

ఇందుకు గాను వారు కాశీకి ప్రయాణం అయారు.

బయలుదేరేముందు నాగప్ప తన భార్య చేత మినపగారెలూ, పులిహోరా వండిం చాడు. అలాగే సిద్దప్ప తన కిష్టమైన చక్కెర పొంగలీ, నేతి రొట్టెలూ వండించాడు. ఇద్దరూ తమ ఇతర వస్తువులతో బాటు ఆహారం కూడా కట్టుకుని, కాశీ ప్రయాణం మీద బయలుదేరారు.

వాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ, సూర్యుడు నడి నెత్తిమీదికి వచ్చినదాకా నడిచి, ఏ చెట్టు కిందనో విశ్రాంతి తీసుకున్నారు. ఇద్దరికీ ఆకలి దహించుకు పోతున్నది. అయినా వాళ్ళు తమ ఆహారపు మూటలు విప్పలేదు. సిద్దప్ప ఏ పచ్చడి అన్నమో తెచ్చి ఉండ వచ్చు; వాడికి తన గారెలలోనూ, పెరు గన్నం లోనూ సగం ఎందు కివ్వాలని నాగప్ప అనుకున్నాడు. నాగప్ప ఏ పెరు గన్నమో తెచ్చి ఉంటాడు; వాడికి తన చక్కెర పొంగలిలో సగం వాటా ఎందు కివ్వాలని సిద్దప్ప అనుకున్నాడు.

డొక్కలు మాడుతున్నప్పటికీ వాళ్ళు తిండి మాట ఎత్తక, తిరిగి నడక సాగించి, చీకటి పడ్డాక దారి పక్కన ఒక పాడు

బుర్లె నాగేశ్వరరావు



పడిన గుడి కనిపిస్తే, అందులో విశ్రమించారు. కాని ఇద్దరికీ ఆకలితో నిద్ర రాలేదు. రెండో వాడు నిద్ర పోగానే తన ఆహారం తాను తినాలని వాళ్ళిద్దరూ ఆలోచించారు. కాని అది సాధ్యం కాలేదు. ఇద్దరూ ఒకరి మీద ఒకరు నిఘావేసి తెల్లవార్లూ మేలుకుని ఉన్నారు. అందుచేత తెల్లవారే సరికి ఇద్దరూ చచ్చు పీనుగుల్లాగా తయారై, నడవలేక పోయారు.

నాగప్ప విచారంగా తన గారెల మూట కేసి చూసే సరికి అందులో నుంచి చీమలు బారులుకట్టి వస్తూ ఉండటం అతనికి కనబడింది. వాటిని చూస్తూనే నాగప్పకు ఒళ్ళుపై తెలియనంత శివం ఎత్తింది, కళ్ళు ఎరుపెక్కాయి, పళ్ళు పటపటా కొరికాడు.

"ఏం, నాగప్పా? ఉన్నట్టుండి అలా రుద్రుడి వైపోతున్నావేం?" అని సిద్దప్ప అడిగాడు.

"చూశావా, నా పెళ్ళాం ఎంతపని చేసిందో? గారెలతో బాటు చీమలు కూడా పోసి మూట కట్టింది," అంటూ నాగప్ప గారెలమూట విప్పాడు. గారెలు పాచి కంపు కొడుతున్నాయి. వాటినిండా చీమల పుట్టలు! నాగప్ప వాటిని దూరంగా పారేస్తూ, "పాడుముండ! దాని ఎముకలు విరుస్తానుండు!" అన్నాడు.

తొందర తొందరగా సిద్దప్ప కూడా తన చక్కెర పొంగలి మూట విప్పిచూశాడు. అందులో కూడా చీమలు చేరాయి. పొంగలి పులిసిన వాసన కొట్టుతున్నది.

అది చూసి సిద్దప్ప, "చూశావా, నాగప్పా? నా పెళ్ళాంకూడా నన్ను మోసం చేసింది. మనం వెంటనే తిరిగి వెళ్ళి మన ఆడవాళ్ళకు బుద్ధి చెప్పాలి," అన్నాడు.

అందుకు నాగప్ప సమ్మతించాడు.

ఇద్దరూ తిరిగి తమ ఇళ్ళకు ప్రయాణమై, ఇంటికి చేరుతూనే తమ పెళ్ళాలను తన్నారు. కాని ఆడవాళ్ళు మాత్రం తమ భర్తల బుద్ధి తక్కువను సరిగానే అర్థం చేసుకున్నారు.

మిత్రు లిద్దరూ మరొక మంచి రోజు చూసుకుని కాశీకి ప్రయాణ మయారు. ఈ సంగతి నిర్ణయం కాగానే నాగప్ప భార్యా, సిద్దప్ప భార్యా కలుసుకుని, "ఈసారి మనం మన మొగుళ్ళకు సరి అయిన బుద్ధిచెప్పి, వారిచేత ఈ కాశీ ప్రయాణాలు మాన్పించాలి," అను కున్నారు. అందుకేం చేయాలో వాళ్ళు కూడబలుక్కున్నారు.

తమ భర్తలు కాశీకి ప్రయాణం అయే టప్పుడు వారికి ఆహారం మూటలు కట్టి ఇస్తూ, "కాశీ యాత్రికులు దారి పొడుగునా దానధర్మాలు చెయ్యాలి. లేకపోతే యాత్ర చేసిన ఫలితం ఉండదు," అని తమ భర్తలతో అన్నారు.

మిత్రు లిద్దరూ మధ్యాన్నందాకా నడిచి, తిండి తినటానికి ఒక చెట్టు నీడన కూర్చు న్నారు. ఈ సారి ఇద్దరూ బుద్ధిగానే తమ మూటలు విప్పారు. ఇద్దరి మూటల్లోనూ గారెలే ఉన్నాయి. అయినా నాగప్ప తన గారెలు కొన్ని సిద్దప్పకు ఇచ్చి, సిద్దప్ప ఇయ్యగా అతని గారెలు తీసుకున్నాడు.

సిద్దప్ప ఇచ్చిన గారె ఒకటి నోట పెట్టు కోగానే నాగప్ప నోరు భగ్గున మండింది. అదే సమయంలో సిద్దప్ప నాగప్ప ఇచ్చిన గారె కొంచెం తినే సరికి వాంతి అయినంత పని అయింది.

సిద్దప్ప తెచ్చిన గారెలలో పచ్చిమిరప కాయల కారం అవసరమైన దానికి రెట్టింపు ఉన్నది. ఉప్పు లేనేలేదు.



తన మీది కోపంతో తనకు అలాంటి గారెలు ఇచ్చాడనుకుని నాగప్ప కోపంలో వెనకా, ముందూ చూడకుండా, పిడికిలి బిగించి సిద్దప్ప నెత్తిన బలంగా కొట్టి, "కారం! కారం!" అంటూ రొప్ప నారంభించాడు.

నాగప్ప ఇచ్చిన గారెల్లో ఉప్పు రెండింత లున్నది గాని కారం ఏమీలేదు. "ఉప్పు! కషాయం!" అని సిద్దప్ప నాగప్ప మీద విరుచుకు పడ్డాడు.

"కారం! కారం!", "ఉప్పు కషాయం!" అని అరుస్తూ ఇద్దరూ కలియబడి తన్నుకో సాగారు.

అప్పుడు దారినపోయే పెద్దమనిషి ఒకడు వాళ్ళను ఆపి, "ఎందుకు మీరిలా తన్నుకుంటున్నారు?" అని అడిగాడు.

"అయ్యా, మే మిద్దర మూ ప్రాణ స్నేహితులంగా ఉంటామని దేవుడి ఎదట ప్రమాణం చెయ్యటానికి కాశీ వెళుతున్నాం. ఇద్దరమూ ఇంటినుంచి తిండి తెచ్చుకున్నాం. ఆకలిగా ఉండి, తినటానికి మూటలు విప్పాం. నాకు చూడండి, ఎలాటి గారె ఇచ్చాడో? స్నేహితుడు చేసే పనేనా?" అని ఒకరి తరవాత ఒకరుగా నాగప్పా, సిద్దప్పా ఆ పెద్దమనిషికి ఫిర్యాదు చేశారు.

"ఏదీ, చూస్తాను. మీ ఇద్దరిదీ చెరొక గారె నా కివ్వండి," అంటూ ఆ పెద్ద మనిషి ఇద్దరి గారెలూ కాస్త కాస్త కొరికి తింటూ, "నాకేమీ లోపం కనిపించ లేదే? దివ్యంగా ఉన్నాయి గారెలు. కాకపోతే రెండూ కలిపి తినాలి. అంతే! పిచ్చి వాళ్ళల్లారా! స్నేహమైనా అంతే, మనస్సులు కలవాలి, అంతేగాని దేవుడి ఎదుట ప్రమాణాలుచేసి ఏంలాభం? మీ కన్న మీ భార్యలు తెలివిగల వాళ్ళలాగా కనబడతారు. వాళ్ళు మీకు నేర్పిన గుణపాఠం తల కెక్కితే మీరు మంచి స్నేహితులుగా ఉండగలుగుతారు!" అన్నాడు.

నాగప్పా, సిద్దప్పా తమ అవివేకానికి సిగ్గుపడ్డారు. వాళ్ళు కాశీ ప్రయాణం మానుకుని, ఇళ్ళకు తిరిగి వెళ్ళి, మంచి స్నేహితులుగా మసులుకుంటూ వచ్చారు.





# కొయ్యగుర్రం

## 5

తనను రాజకుమారుడి వద్దకు తీసుకుపోతా నన్నవాడు గుర్రం మీద ఎక్కి, తనతోపాటు ఆకాశంలోకి వెళ్ళిపోతూండటం చూసి రాజకుమార్తె షమ్సు విజ్ఞానితో, "మీ యజమాని చెప్పినదేమిటి? నువు చేస్తున్నదేమిటి?" అన్నది.

ముసలివాడు నవ్వి. "నా యజమానా? వాడెవడు? కమరల్ అక్మార్ గురించి మాట్లాడుతున్నావా? వాడు ఏమీ తెలియని కుర్రకుంక!" అన్నాడు.

"ఛీ, పాపిష్ఠివాడా? నీ యజమానిని గురించి అలాగేనా మాట్లాడేది?" అన్నది షమ్సు అల్ నహర్.

"వాడు నా యజమాని కాదని చెప్పటం లేదా? ఆ పొగరుబోతు అక్మార్ సంగతి అలావుంచు. నే నెవరినో నీకు తెలుసా?" అన్నాడు ముసలివాడు.

"నువు చెప్పినది తప్ప నా కింకేమీ తెలీదు. అసలు నువ్వెవరివి?" అన్నది రాజకుమార్తె.

"నీకూ, వాడికీ ఉచ్చులు వెయ్యటానికి అబద్ధాలు చెప్పాను. వాడు నా గుర్రాన్ని కాజేసి, నాకు భరించరాని బాధ కలిగించాడు. నాది నాకు తిరిగి దక్కింది. ఇక వాణ్ణి కుమిలి చావనీ! నువ్వేమీ విచారించకు. ఆ వెధవకన్న నేను నీకు ఎక్కువయినవాణ్ణి, శక్తిమంతుణ్ణి, ధనికుణ్ణి, దాతను. నా బానిసలూ, నౌకర్లూ నిన్ను నన్ను కొలిచినట్టే కొలుస్తారు. ఏ రాజులూ ఇయ్యలేని వస్త్రాభరణాలు నీ కిస్తాను. నీకు తీరని కోరిక అంటూ ఉండబోదు," అన్నాడు ముసలివాడు.

షమ్సు అల్ నహర్ ముఖం బాదుకుని ఏడుస్తూ, "అయ్యో, ప్రారబ్ధమా! తల్లి



దండ్రులకు కాకుండా పోయినట్టే ప్రియుడికి కూడా కాకుండా పోతున్నాను," అన్నది.

ముసలివాడు గుర్రాన్ని టర్కీ దేశం కేసి పోనిచ్చాడు. కొద్ది గంటలలో గుర్రం ఆ దేశాన్ని చేరుకుని, ఒక మహానగరం సమీపంలో గల పచ్చిక మైదానంలో దిగింది. ఆ మైదానంలో అందమైన చెట్లూ, సెలయేళ్ళూ ఉన్నాయి.

ఆ మహానగరాన్ని పాలించే సుల్తాను ఆ రోజే వాహ్యాళికి ఆ మైదానానికి వచ్చి, అక్కడ పచార్లు చేస్తూ చల్లగాలి అనుభవిస్తున్నాడు. ఆయన ముసలివాణ్ణీ, గుర్రాన్నీ, పడుచు పిల్లనూ చూసి తన బానిసలను పంపకం చేశాడు. వాళ్ళు వెళ్ళి, అమాంతం ముసలివాడి మీద పడి పట్టుకుని, రాజకుమార్తెనూ, కీలుగుర్రాన్నీ వెంట బెట్టుకుని, సుల్తాను ముందు ఉంచారు.

ముసలివాడి వికారాకారం చూస్తుంటే సుల్తానుకు జుగుప్స కలిగింది. ఆయన రాజకుమార్తెతో, "అమ్మాయీ, నిన్ను ఈ అందవికారికి కట్టబెట్టిన నీ వాళ్ళు ఎటువంటి క్రూరకర్ములై ఉండాలి?" అన్నాడు.

"ఈమె నాకు భార్యేగాక దగ్గిర బంధువు కూడా లెండి!" అన్నాడు ముసలివాడు సుల్తానుతో.

వెంటనే రాజకుమార్తె, "ప్రభూ, ఈ శతవృద్ధును నేను ఎరగనైనా ఎరగను, అల్లా తోడు! ఇతను నా భర్తకాడు, గారడీవాడు. మాయజేసి, అబద్ధాలాడి నన్ను బలాత్కారంగా ఎత్తుకొచ్చాడు." అన్నది.

ఈ మాట వింటూనే టర్కీసుల్తాను ఆ ముసలాణ్ణి కొట్టమని తన బానిసలకు ఉత్తరు విచ్చాడు. వాళ్ళు వాణ్ణి చావగొట్టి కొన ప్రాణంతో వదిలిపెట్టారు. ముసలివాణ్ణి నగరానికి తీసుకుపోయి చీకటి కొట్టులో బంధించమని ఉత్తరు విచ్చి, రాజకుమార్తెనూ, గుర్రాన్నీ సుల్తాను తన రాజభవనానికి తీసుకుపోయాడు. అయితే ఆ గుర్రంలో ఉన్న విశేషం ఆయనకు ఏమీ తెలియదు.

తన ప్రియురాలిని కోల్పోయిన రాజకుమారుడు కమర్ ప్రయాణపు దుస్తులు

ధరించి, తన వెంట ఆహారమూ, ధనమూ తీసుకుని రాజకుమార్తెను వెతుకుతూ బయలుదేరాడు. అతను అనేక దేశాలు గడిచి, అనేక రాజధానులు చూసి, దారిలో కనిపించిన వారిని, "నల్లచేవ కర్రతో చేసిన గుర్రాన్ని చూశారా?" అని అడిగితే, వాళ్ళంతా అతనికి మతి సరిగాలేదు కాబోలు ననుకున్నారు.

అతి భారంగా అనేక మాసాలు గడిచాయి. అతను ఎంతో ఓపికగా కనిపించిన వారి నందరినీ కీలుగుర్రం గురించి అడుగుతూనే ఉన్నాడు. కాని అతనికి కావలిసిన వార్త చెప్పినవారు లేరు.



కమర్ తన మామగారి నగరమైన సనా చేరాడు. అక్కడ కూడా అతనికి షమ్స్ జాడ తెలియరాలేదు. పైపెచ్చు, షమ్స్ తండ్రి కూతురివియోగంతో కుమిలిపోతున్న సంగతి తెలిసి, కమర్‌కు గోరుచుట్టు మీద రోకటిపోటు అయింది. కమర్ అలాగే ముందుకు సాగి టర్కీదేశం చేరాడు.

ఒకనాడు అతను ఒక సత్రంలో దిగాడు. అక్కడ కొందరు వర్తకులు చేరి మాట్లాడుకుంటున్నారు. వాళ్ళకు సమీపంలోనే కూర్చున్న కమర్‌కు ఒక వర్తకుడు చెప్పే వింత వార్త చెవినపడింది. అతను మిగిలిన వర్తకులతో, "నేను ఫలాని నగరంలో ఒక సంగతి విన్నాను. రాజుగారు వాహ్యాళికి వెళ్ళి, ఒక మైదానంలో ఒక ముసలివాణ్ణీ, వాడి వెంట ఒక అందాలరాశినీ చూశాడట. వారి వెంట నల్లమాను కర్రతోనూ, దంతంతోనూ చేసిన గుర్రం బొమ్మ ఉన్నదట," అంటూ తాను విన్నదంతా చెప్పాడు.

కమర్‌కు కావలసిన వార్త ఇంతకాలానికి దొరికింది. అతను ఆ నగరం ఎటుగా ఉన్నదీ, ఎక్కడ ఉన్నదీ తెలుసుకుని, అతి వేగంగా అక్కడికి బయలుదేరాడు. అతను నగర ద్వారం దాటుతూ ఉండగా రాజభటులు అతన్ని పట్టుకుని, రాజుగారి వద్దకు తీసుకుపోబోయారు. నగరం ప్రవేశించే విదేశీయులను రాజు ప్రశ్నించటం అక్కడి పద్ధతి.



అందమైన పిల్లనూ, ఒక ముచ్చటైన కొయ్యగుర్రాన్నీ చూశారు. ఆ పిల్లకు ఉన్నట్టుండి పిచ్చి ఎత్తింది. లేకపోతే మా రాజుగారు ఈ పాటికి ఆమెను పెళ్ళాడేవారే. ఆమె పిచ్చి కుదర్చటానికి మా రాజుగారు ఎందరో వైద్యులను పెట్టి, ఎంతో డబ్బు ఖర్చు చేశారు. ఆ ముసలాడు నిజంగా వైద్యుడైతే ఆమె పిచ్చి కుదర్చలేక పోయాడా? కొయ్యగుర్రాన్ని రాజుగారు భాండారంలో పెట్టించారు. ముసలాడు ఖైదులో ఉన్నాడు; తెల్లవార్లూ మూలుగుతూ నేవుంటాడు, మమ్మల్ని నిద్రపోనివ్వడు," అన్నారు.

అయితే అప్పటికి చాలా పొద్దుపోవటం చేత భటులు కమర్‌ను ఆ రాత్రికి బందిఖానాలో ఉంచి, తాము తినే ఆహారమే అతనికి కూడా పెట్టి, "బాబూ, నువు ఏ దేశం నుంచి వస్తున్నావు?" అని అడిగారు. అతను పర్షియా నుంచి వస్తున్నానన్నాడు.

ఆ మాట విని భటులు నవ్వి, "మీ దేశం వాడొకడు ఇక్కడే ఉన్నాడు. అంత అబద్ధాలమారిని మేము ఎన్నడూ చూడలేదు. చూడటానికి అంత అసహ్యమైన మనిషి మరెక్కడా ఉండడు. తాను గొప్ప విజ్ఞానిననీ, ప్రసిద్ధి గల వైద్యుణ్ణి అనీ అంటాడు. మా రాజుగారు మైదానంలో వాణ్ణీ, ఒక

తాను సరి అయిన చోటికే వచ్చినట్టు కమర్ గ్రహించాడు. నిద్రవేళ కాగానే రాజభటులు అతన్ని ఒక కొట్టులో బంధించారు. ఆ గదిలోకి పోగానే అతనికి పర్షియా భాషలో ఎవరో మాట్లాడుకుంటూ ఉండటం వినిపించింది:

"అయ్యో, ఇంతకన్న మంచి ఉపాయం ఆలోచించకపోతినే! ఆ పిల్ల కాస్తా నా చెయి జారిపోయింది. దురాశకు పాల్పడ్డాను!"

ఈ మాటలు విని, ఆ వగచేవాడు పర్షియా విజ్ఞాని అని గ్రహించి కమర్ పర్షియను భాషలో, "ఎందుకు ఏడుస్తావు? ప్రపంచంలో నీ లాటి అభాగ్యులు ఇంకెవరూ లేరనుకుంటున్నావా?" అని అడిగాడు.



వెంటనే ముసలివాడికి ప్రాణం లేచి వచ్చినట్టు అనిపించి, తన కథ అంతా కమర్ దగ్గిర వెళ్ళబోసుకున్నాడు. కమర్‌ను అంధకారంలో ముసలివాడు గుర్తించనే లేదు. తెల్లవార్లూ వాళ్ళిద్దరూ ఆప్తమిత్రుల లాగా మాట్లాడుకున్నారు.

మర్నాటి ఉదయం రాజభటులు వచ్చి కమరల్ అక్మార్‌ను సుల్తాను వద్దకు తీసుకుపోయి, "ఈ కుర్రవాడు నిన్న రాత్రి పొద్దుపోయి నగరం ప్రవేశించాడు. అందుచేత ఇతన్ని అప్పుడే తమ ఎదట హాజరు పరచటం సాధ్యం కాలేదు," అని చెప్పుకున్నారు.

"నువు ఎక్కడినుంచి వస్తున్నావు? నీ పేరేమిటి? నీ వృత్తి ఏమిటి? మా దేశానికి ఏం పనిమీద వచ్చావు?" అని సుల్తాను కమర్‌ను అడిగాడు.

"నన్ను హర్జా అని పిలుస్తారు. నేను పర్షియాదేశపు వాణ్ణి. నా వృత్తి వైద్యం. బుద్ధి వైకల్యానికీ, పిచ్చికీ నేను ప్రత్యేకంగా వైద్యం చేస్తాను. దేశ సంచారం చేసి వైద్యం చేస్తూ అనుభవం గడిస్తాను. పెద్ద పెద్ద తలపాగాలు ధరించటమూ, పెద్ద తావళాలు మెడలో వేసుకోవటమూ, పెద్ద పెద్ద పుస్తకాలు చంకలో పెట్టుకోవటమూ, పంచాంగాలు తిరగవెయ్యటమూ నా పని కాదు. మంత్రాలు చదవను. ఇవేవీ లేకుండానే నేను చికిత్సలు చేస్తాను," అన్నాడు కమర్.

సుల్తాను పరమానందం చెంది, "వైద్యుడా, సమయానికి వచ్చావు! మాకు నీ సహాయం ఎంతైనా అవసరం," అంటూ రాజకుమార్తె పరిస్థితి చెప్పి, "ఆ పిల్లను పట్టి పీడిస్తున్న దయ్యాన్ని వదిలించావంటే నువు ఏది కోరితే అది సంతోషంగా ఇస్తాను," అన్నాడు.

"అల్లా ఏలినవారిని అనుగ్రహాలలో ముంచి ఎత్తాలి! ముందు నాకు ఈ పిల్ల ఉన్మాదం ఎలా ఆరంభమయినదీ, ఎంత కాలంగా ఉన్నదీ, ఆ ముసలివాడి సంగతీ, కొయ్యగుర్రం సంగతీ తమకు జ్ఞాపకం

ఉన్న మేరకు సవిస్తరంగా చెప్పండి," అన్నాడు కమర్.

సుల్తాను మొదటినుంచీ జరిగినదంతా కమర్‌కు చెప్పి, "ముసలివాణ్ణి ఖైదులో పెట్టించాను. గుర్రం భాండారంలో భద్ర పరిచాను," అన్నాడు.

ఆ గుర్రాన్ని ఒకసారి చూడాలని కమర్‌కు అనిపించింది. అది చెక్కు చెదరకుండా ఉంటే సరేసరి, దాని కీళ్ళు చెడిపోయి ఉంటే అతను తన ప్రియురాలిని రక్షించ టానికి ఇతర మార్గాలు చూసుకోవలసి ఉంటుంది.

అతను సుల్తానుతో, "నేనొకసారి ఆ గుర్రాన్ని పరీక్షించాలి. అందువల్ల చికిత్స సులువు కావచ్చు," అన్నాడు.

"అలాగే!" అంటూ సుల్తాను కమర్‌ను గుర్రం ఉన్న భాండారానికి తీసుకు పోయాడు. కమర్ దాన్ని పరీక్షించి, దాని యంత్రాలన్నీ సరిగా ఉన్నట్టు తెలుసుకుని ఆనందంతో, "ఇప్పుడు నేను ఆ పిల్లను పరీక్షించి రోగనిదానం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. అల్లా అనుగ్రహిస్తే, నేను ఆమె వ్యాధి కుదర్చగలననుకుంటాను. అందుకు ఈ కొయ్యగుర్రం అవసరం అవు తుంది. అందుచేత దాన్ని మీ భటులు జాగ్రత్తగా కాపాడాలి," అన్నాడు.

సుల్తాను అతన్ని రాజకుమార్తె ఉన్న గదికి తీసుకుపోయాడు. ఆమె చేతులు మెలిపెడుతూ, రొమ్ము బాదుకుంటూ, బట్టలు చించుకుంటూ అతనికి కనబడింది.



ఆమెకు నిజంగా పిచ్చి లేదనీ, ఉన్నట్టు నటిస్తున్నదనీ కమర్ గ్రహించాడు.

అతను రాజకుమార్తెను సమీపిస్తూ, "త్రిలోకసుందరీ, నీ కష్టాలన్నీ తొలగిపోవు గాక!" అన్నాడు.

ఆమె అతన్ని చూసి గుర్తించి, ఆనందం పట్టలేక కెవ్వన అరిచి, స్పృహతప్పి పడిపోయింది. వైద్యుడికి భయపడి ఆమె మూర్ఛపోయిందని సుల్తాను అనుకున్నాడు. కమర్ ఆమెకు తిరిగి స్పృహ కలిగించి, రహస్యంగా ఆమెతో, "కాస్త నిగ్రహించుకో. నిజం బయటపడితే మన ఇద్దరికీ అపాయం ఉన్నది. నిన్ను పట్టిన దయ్యం వదిలినట్టు రాజు దగ్గర నటించు," అని హెచ్చరించాడు.

ఆమె కూడా రహస్యంగా, "సరే," అన్నది. కమర్ దూరంగా నిలబడి ఉన్న సుల్తానును సమీపించి, "ప్రభూ! తమ దయవల్ల ఈమె వ్యాధిని సరిగా గ్రహించి, చికిత్స కూడా చెయ్యగలిగాను. తమరు ఆమె వద్దకు వెళ్ళి సౌమ్యంగా పలకరించండి. మీరు ఆమెకు ఏమేమి కోరికలు తీర్చదలిచారో వాటన్నిటినీ తీర్చుతానని చెప్పండి," అన్నాడు.

సుల్తాను షమ్స్ అల్ నహార్‌ను సమీపించాడు. ఆమె లేచి నిలబడి ఆయనకు ప్రణామం చేసి, "తమరి రాకతో పవిత్రమయాను!" అన్నది.

ఆమెలో అంత మార్పు రావటం చూసి సుల్తాను ఆనందంతో పరవశుడయాడు;





ఆమెను స్నానశాలకు తీసుకుపోయి స్నానం చేయించి, ఆమెకు వెలలేని దుస్తులూ, ఆభరణాలూ పెట్టమని తన చెంత ఉన్న అడబానిసలనూ, కొజ్జాలనూ ఆజ్ఞాపించాడు. వారు అలాగే చేశారు.

సుల్తాను కమర్‌తో, "మహాత్మా, మాకు ఎనలేని ఆనందం కలిగించావు. అల్లా కృప నీ పైన ఉండుగాక!" అన్నాడు.

"ప్రభూ, ఈ ఆనందం మీకు శాశ్వతంగా దక్కాలంటే మీరు ఈ పిల్లనూ, ఆ కొయ్యగుర్రాన్నీ తీసుకుని, సపరివారంగా ఆమె మీకు కనిపించిన చోటికి వెళ్ళవలసి ఉంటుంది. నిజానికి ఆ గుర్రం ఒక దయ్యం. అదే ఆమెను ఆవహించి, మతి భ్రమ కలిగించింది. ఆ ప్రదేశంలో నేనా దయ్యాన్ని ఉద్వాసన చేస్తాను. లేకపోతే అది మళ్ళీ ఆమెను ఆవహించవచ్చు. ప్రతి మాసం ఆరంభంలోనూ అది ఆమెను పట్టటమూ, మళ్ళీ మళ్ళీ దానిని వదిలించటమూ చెయ్యవలసి వస్తుంది. అందుచేత ఆ దయ్యాన్ని శాశ్వతంగా మారణహోమం చెయ్యటం అన్నివిధాలా మంచిది," అన్నాడు కమర్.

"దానికేం? తప్పకుండా అలాగే చేద్దాం!" అన్నాడు టర్కీ సుల్తాను.

ఆయన తన కొలువులో ఉన్న వారినీ, సేవకులనూ, కమర్‌నూ, షమ్సనూ, గుర్రాన్నీ వెంటబెట్టుకుని మైదానానికి అప్పటికప్పుడే ప్రయాణమయాడు.

మైదానంలో కమర్ కీలుగుర్రాన్ని చాలా దూరంగా ఉంచి, దాని మీద రాజకుమార్తెను ఎక్కించి, "ఏలినవారు అనుమతిస్తే, నేను కూడా ఈ గుర్రం మీద ఎక్కి, దయ్యం చేత ఈ గుర్రాన్ని తమ వద్దకు నడిపిస్తాను," అన్నాడు.

"ఎంత అద్భుతం!" అనుకున్నాడు సుల్తాను.

కమర్ కీలుగుర్రం మీద తాను కూడా ఎక్కి కూర్చుని, తన వెనక ఉన్న రాజకుమార్తెను తనకు దృఢంగా బంధించుకున్నాడు. తరవాత అతను మీట తిప్పే

సరికి, అందరూ చూస్తూండగానే గుర్రం ఆకాశంలోకి లేచి, అదృశ్యమైపోయింది.

జరిగినదేమిటో గ్రహించక సుల్తాను, ఆ గుర్రం మీద వైద్యుడూ, ఆ పిల్లా తిరిగి వస్తారని, ఒక పూట అంతా సపరివారంగా అక్కడే ఉండిపోయాడు. తరవాత ఆయన రాజభవనానికి తిరిగి వెళ్ళి చాలాసేపు అక్కడ ఎదురు చూశాడు. కాని గుర్రం మీద వెళ్ళిన వారి జాడలేదు.

ఇంతలో ఆయనకు తాను బందిఖానాలో ఉంచిన ముసలివాడు జ్ఞాపకం వచ్చాడు. ఆయన ఆ ముసలివాణ్ణి పిలిపించి, "ఓరీ, ద్రోహీ! ఆ గుర్రం బొమ్మలో పిశాచం ఉన్న సంగతి నాదగ్గర ఏమని దాచావు? ఇప్పుడా దయ్యం వైద్యుణ్ణీ, ఆ పిల్లనూ కూడా ఎగరేసుకుని ఎటో పోయింది. పాపం, వాళ్ళు ఏమవుతారో? ఈ నేరానికి నీ తల ఇప్పుడే తీయిస్తాను." అన్నాడు.

సుల్తాను ఆజ్ఞాపించటమే తడవుగా సుల్తాను బానిసలు ముసలివాడి తలనూ, మొండాన్నీ వేరు చేసేశారు.

కీలుగుర్రం మీద కమర్, షమ్సు రాజకుమారితో సహా క్షేమంగా తన ఇంటికి తిరిగి వచ్చి, తిన్నగా తమ రాజభవనం పైభాగాన దిగాడు. శోకసముద్రంలో మునిగి ఉన్న రాజకుటుంబం ఆనందసముద్రంలో ఓలలాడింది. తన కుమారుడి వివాహ సందర్భంలో సాబూర్‌రాజు చాలా రోజులపాటు ఉత్సవాలు జరిపాడు. ఎందుకైనా మంచిదని ఆయన కీలుగుర్రాన్నీ, దాని యంత్రాలనూ తన చేత్తోనే ధ్వంసం చేసి, పీడ విరగడి అయిందని సంతోషించాడు.

కమర్ సానాలోని తన మామగారికి జరిగినదంతా తెలుపుతూ ఉత్తరం రాసి, ఆయనకు బహుమానాలతోసహా ఆ ఉత్తరాన్ని దూతల ద్వారా పంపాడు.

కొంతకాలానికి సాబూర్‌రాజు మరణించి, కమర్ రాజు అయ్యాడు. అతను రాజ్యానికి వస్తూనే, తన చిన్న చెల్లెలిని తన బావమరిదికి ఇచ్చి పెళ్ళి చేశాడు. తరవాత కమర్, షమ్సులు చాలాకాలం సుఖంగా జీవించారు.

—(అయిపోయింది)



# లోభి

ఒక ఊళ్ళో ఒక ధనికుడు ఉండే వాడు. అతను పరమ లోభి. కడుపునిండా తినేవాడు కాడు, ఒంటి మీద మంచి బట్ట వేసుకునే వాడు కాడు.

ఒక పండగనాడు అతని జీతగాడు అతన్ని చూసి, "బాబుగారూ, ఈ రోజు పండగ గదా. పాత బట్టలు వేసుకున్నా రేమిటి? కొత్త బట్టలు వేసుకోండి," అని ఉండ బట్టలేక అన్నాడు.

"ఒరే, వెంకన్నా! ఈ ఊళ్ళో నన్ను ఎరగని వాళ్ళెవరు? నేను కొత్త బట్టలు వేసుకోక పోయినా పరవా లేదులే!" అన్నాడు ధనికుడు.

జీతగాడు తన మనసులో, 'వట్టి పిసినారి!' అనుకుని మాట్లాడక ఊరుకున్నాడు.

మరొక రోజు ధనికుడు పొరుగూరు పోతూ, "ఒరే, వెంకన్నా! నేను ఊరెళ్ళి వస్తాను. ఇల్లు జాగ్రత్త!" అన్నాడు.

"బాబుగారూ, ఊరు వెళ్ళేటప్పుడు కూడా పాత బట్టలే వేసుకు వెళుతున్నారే?" అని జీతగాడు అడిగాడు.

"అక్కడ నన్నెవరు ఎరుగుదురురా, పిచ్చి నాగన్నా? ఏ బట్టలు వేసుకు వెళ్ళినా ఒకటే!" అన్నాడు ధనికుడు.

—ఎం. ముంతాజ్ బేగం.





# చంద్రభానుడు

ఛత్రపురాన్ని ఏలే ఉదయభానుడికీ, ఆయన భార్య రూపమతికీ చాలాకాలం సంతానం కలగలేదు. పిల్లల కోసం వాళ్ళు ఉపవాసాలు చేశారు. ఎందరో దేవతలను ఆరాధించారు, ఎంతోమంది సాధువులనూ, సన్యాసులనూ సేవించారు. కాని ఏ విధం గానూ వారికి సంతానం కలగలేదు.

చివరకు, నలభై ఏళ్ళ నడి వయసులో ఉదయభానుడు లావణ్య అనే సౌందర్య వతిని రెండవ భార్యగా పెళ్ళాడాడు. ఆమె సొంపూ, సొయగమూ చూసి పరవశుడై పోయి, ఆమె తోటిదే లోకంగా ఉంటూ, పెద్ద భార్య అయిన రూపమతిని రోజూ చూడక, నెలకు రెండు మూడు సార్లు మాత్రమే ఆమె దగ్గిరికి వెళ్ళుతూ ఉండేవాడు.

రాజు లావణ్యాను పెళ్ళాడి రెండేళ్ళ యింది. కాని ఆమెకు పిల్లలు కలగలేదు. కాని రాజు మాత్రం ఆమెకు పూర్తిగా విధేయుడయిపోయాడు. కాని ఈ కాలంలోనే రూపమతి ఏవో మూలికల ప్రభావంతో గర్భ వతి అయి, ఒక చక్కని మగ బిడ్డను కన్నది. రాజుకు అమితమైన ఆనందం కలిగింది. పిల్లవాడికి చంద్రభానుడు అని పేరు పెట్టుకున్నారు. తనకు మళ్ళీ మంచి రోజులు వచ్చాయని రూపమతి ఆశపడింది.

అయితే అలా జరగలేదు. ఎందుచేత నంటే, లావణ్య రాజుకు ఏమీ వ్యక్తిత్వం లేకుండా చేసేసింది. ఆయన ఇప్పుడు ఆమె గీసిన గీటు దాటలేదు; లావణ్య ఏమి చెయ్యమంటే అదెల్లా చేసేవాడు.

రూపమతి పైన ఈర్ష్యతో లావణ్య, రూపమతి మాయలమారి అనీ, మంత్ర శక్తులతో కొడుకును కన్నదనీ, ఆమెకు పుట్టిన వాడు రాజ్యానికి ఉపద్రవం తెస్తాడనీ రాజుకు నచ్చ చెప్పింది. పిల్లల కోసం



అష్ట కష్టాలు పడ్డ రాజు లావణ్య మాయ మాటలు నమ్మి, పసికందుగా ఉన్న చంద్రభానుణ్ణి అడవుల పాలు చెయ్యటానికి ఒప్పుకున్నాడు.

ఎనిమిది నెలల వయసు గల చంద్రభానుణ్ణి అరణ్యంలో వదిలిపెట్టే ఘోర కార్యాన్ని సత్పాలుడు అనే భటుడికి అప్పగించారు. సత్పాలుడు ఆ పసికందును తీసుకుని అరణ్యం కేసి బయలుదేరాడు, కాని అతను అరణ్యంలోకి వెళ్ళక, పక్కనే ఉన్న సాతుపురిరాజ్యానికి వెళ్ళి, అక్కడ ఉండే తన మిత్రుడైన జాదూపతి అనేవాడి ఇంటికి వెళ్ళాడు. జాదూపతి ఇంద్రజాల విద్యలు తెలిసినవాడు. ఆయన చంద్రభానుణ్ణి తానే పెంచి, పెద్ద చేయటానికి ఒప్పుకున్నాడు. సత్పాలుడు తన దేశానికి తిరిగి వెళ్ళి, రాచబిడ్డను కీకారణ్యంలో వదిలి వచ్చినట్టు చెప్పాడు.

నెలలూ, సంవత్సరాలూ దొర్లిపోయాయి. ఉదయభానుడికి మరి సంతానం కలగలేదు. లావణ్య ప్రోద్బలం చేసిన మీదట ఆయన లావణ్య మేనల్లుణ్ణి, మహావీరుడు అనేవాణ్ణి, దత్తత చేసుకున్నాడు.

ఉదయభానుడికి వృద్ధాప్యం వచ్చేస్తున్నది. ఆయనకు తనపైన గల వెర్రి వ్యామోహాన్ని ఆసరా చేసుకుని, లావణ్య అన్ని అధికారాలూ చలాయిస్తూ, తన ఇష్టం వచ్చినట్టు ఏలుతున్నది. పెద్దరాణి సేవకులుండే గదులలో ఉండాలనీ, సేవకులు జీవించినట్టు జీవించాలనీ లావణ్య ఉత్తరువు లిచ్చింది. నానాటికీ ఆమెలో వక్రబుద్ధీ, క్రూరత్వమూ పెరిగిపోతున్నాయి. ప్రజలు ఆమెను తీవ్రంగా ద్వేషిస్తున్నారు.

ఉన్నట్టుండి లావణ్య పరిపాలనాధికారాలన్నీ తనకు ఇవ్వమని రాజును ఒత్తిడి చేసింది. దానితో రాజుకు కనువిప్పు కలిగి, తాను ఎంతో కాలంగా పెడదారిన పోయినట్టు గ్రహించాడు. కాని లావణ్యకు సర్వాధికారాలూ సమర్పించక తప్పింది కాదు. అధికారాలన్నీ హస్తగతం కాగానే లావణ్య ఆయనను కూడా సేవకులతో చేర్చేసింది.

ఇంత కాలానికి ఉదయభానుడూ, రూప మతీ ఒకే జీవితంలో భాగస్వాములయారు. తాను చేజేతులా అరణ్యం పాలు చేసిన పసిగుడ్డు అస్తమానమూ ఉదయభానుడి కళ్ళఎదట కనిపిస్తూ ఉండేవాడు. రూపమతి అయనకు సేవలు చెయ్యసాగింది. చంద్ర భానుణ్ణి కన్న పదహారేళ్ళకు రూపమతి తిరిగి గర్భవతి అయి, ఒక చక్కని ఆడపిల్లను కన్నది.

అప్పటికి చంద్రభానుడు జాదూపతి ఇంట పెరిగి పదహారేళ్ళ వాడు అయాడు. అతను మిగిలిన విద్యలతో బాటు, తన పెంపుడు తండ్రి వద్ద ఇంద్రజాలం కూడా నేర్చుకున్నాడు. అతనిప్పుడు అందంగానూ, బలంగానూ, తెలివిగానూ తయారయాడు.

ఒక మంచి రోజు చూసి అతను జాదూ-పతిని వెంటబెట్టుకుని లావణ్య దర్బారుకు వచ్చి, "నేను చంద్రభానుణ్ణి. ఈ రాజ్యానికి నిజమైన వారసుణ్ణి." అని ప్రకటించాడు.

లావణ్య నిర్ఘాంతపోయి, "ఏనాడో అరణ్యంలో క్రూరమృగాల వాత పడిపోయిన వాడినంటావా? వంచకుడా, తక్షణం బయటికి వెళ్ళు!" అన్నది.

"నేను రాజుగారిని ఒకసారి చూడాలి," అన్నాడు చంద్రభానుడు ధైర్యంగా.

"రాజుగారు వృద్ధుడు; రోగిష్ఠి; సభకు రాలేరు," అన్నది లావణ్య.



"నా తల్లిని చూడాలి!" అన్నాడు చంద్రభానుడు.

"నీకొక తల్లి ఉన్నదా ఇక్కడ? ఏమిటి నీ ధైర్యం! వంచన చేసినందుకు నిన్ను ఉరి తీయించగలను," అని లావణ్య అతన్ని బెదిరించింది. ఆమె తన భటులకు, అతన్ని పట్టమని సైగ చేస్తూండగా, చంద్రభానుడు అక్కడినుంచి శరవేగంతో బయటికి వెళ్ళి పోయాడు.

ఆ రాజ్యంలో ప్రజలు లావణ్య పరిపాలనతో విసిగిపోయి ఉన్నారు. ఉదయ భానుడి పైనగాని, ఆయన పెంచుకున్న వాడి మీద గాని వారికి ఎలాటి సదభిప్రాయమూ లేదు. దర్బారులో ఉండిన పురప్రము



ఖులు ఎప్పుడైతే చంద్రభానుణ్ణి చూసి, సింహాసనానికి తాను వారసుడను అనటం విన్నారో, అప్పుడే వారికి ప్రాణాలు లేచి వచ్చాయి.

చంద్రభానుడు పురప్రముఖులను కలుసుకుని తన వృత్తాంతమంతా చెప్పగానే వారు, "ఈ పాపిష్ఠి పాలకురాలి నుంచి మమ్మల్ని ఉద్ధరించు. మేమంతా నీ పక్షం ఉంటాం," అన్నారు.

-వారినందరినీ వెంట బెట్టుకుని, తనను అరణ్యానికి పంపినప్పుడు తాను ధరించి ఉండిన దుస్తులు కూడా తీసుకుని, చంద్రభానుడు మర్నాడు మళ్ళీ దర్బారుకు వెళ్ళాడు. అతను ఆ దుస్తులను లావణ్యా ముందు ఉంచి, "ఇవిగో, నా చిన్ననాటి ఉడుపులు," అన్నాడు.

"పిల్లవాణ్ణి వన్యమృగాలు తినేసిన తరవాత ఎవరో వీటిని సంగ్రహించి ఉంటారు," అన్నది లావణ్య.

"ఈ కుర్రవాణ్ణి ముసలిరాజూ, రాణీ చూసి గుర్తు పట్టగలరేమో చూడరాదా?" అన్నారు పురప్రముఖులు.

ఉదయభానుడూ, రూపమతీ వచ్చి చంద్రభానుణ్ణి చూశారు. కాని వారు అతన్ని గుర్తించలేకపోయారు.

లావణ్య చంద్రభానుడితో, "వంచకుడా, నీ నిజం బయటపడింది. నీకు మరణదండన విధిస్తున్నాను," అన్నది.

అంతదాకా దూరంగా ఉన్న జాదూపతి ముందుకు వచ్చి, "అంత తొందర పనికి రాదు. ఇద్దరు వ్యక్తులు తల్లికొడుకులు అవునో కాదో తెలుసుకోవటానికి ఒక ప్రక్రియ ఉన్నది. తల్లి చనుబాలు చెరువులో ఒక చివర పోసి, చెరువు రెండో చివర కొడుకు కుండతో నీరు తీసినట్టయితే ఆ కుండ నీటిలో ఆ తల్లిపాల జాడలు కనిపిస్తాయి. అందుచేత రూపమతీరాణి స్తన్యం చెరువులో ఒక పక్క పోయించండి. చంద్రభానుణ్ణి రెండవ పక్క నుంచి చెరువులో నీరు తియ్యనివ్వండి. వారిద్దరూ నిజంగా తల్లి కొడుకులైతే తల్లిపాలు కుండలోకి

వచ్చి తీరుతాయి. ఈ పరీక్ష పెట్టగలరా?" అన్నాడు.

జాదూపతి చెప్పినట్టు జరగటం అసాధ్యం గనక లావణ్య అలాటి పరీక్షకు సంకోచించకుండా సమ్మతించింది.

"కాని ఈ పరీక్షలో ఈ మనిషి నెగ్గకపోతే అతనికి శిరచ్ఛేదం తప్పదు," అన్నదామె.

"అందుకు నేను సిద్ధమే!" అన్నాడు చంద్రభానుడు.

పరీక్షకు కావలిసిన ఏర్పాట్లన్నీ జరిగాయి. రెండు రోజుల అనంతరం రాజభవనంలోని కోనేటి వద్ద జనం గుంపులు గుంపులుగా చేరారు. రూపమతి ఇచ్చిన చనుబాలు కోనేరులో ఒక చివర పోశారు. చంద్రభానుడు రెండో చివర ఖాళీ పాత్ర తీసుకుని నీటిలోకి దిగాడు. అతను తన చేతిలోని పాత్రను నీటితో కడిగి, కొద్ది సేపటిలో అందులోకి కొద్ది నీరు తీసుకుని పైకి వచ్చాడు. ఆ నీరు పాల లాగా ఉండటం చూసి ప్రేక్షకులు నిర్ఘాంతపోయారు.

అతనే రూపమతి కొడుకు అనీ, సింహాసనానికి వారసుడనీ పురప్రముఖులు రూఢి చేసుకుని, లావణ్యతో, "ఇక నువు గద్దె దిగవచ్చు! ఈ చంద్రభానుడికి రాజ్యాభిషేకం చేస్తాము," అన్నారు. వారి నిర్ణయానికి లావణ్య తల వంచవలిసి వచ్చింది.

చంద్రభానుడు పాత్రలోకి పాలు ఎలా తెప్పించాడు? అతను ఒక చిన్న గుడ్డ పీలికను అరగా అరగా పన్నెండుసార్లు పాలలో ముంచి, చివరకు ఎండబెట్టి దాన్ని తన బొడ్డులో దోపుకున్నాడు. తరవాత అతను ఖాళీ పాత్రను కడుగుతున్నట్టు నటించేటప్పుడు ఆ గుడ్డపీలికను పాత్రలోని నీటిలో వేసి గిలగొట్టి, ఆ నీటికి పాలరంగు తెప్పించాడు. తరవాత అతను ఆ గుడ్డపీలికను నీటిలో వేసి, కాలితో మట్టిలోకి తొక్కేశాడు. తరవాత అతను పాత్రలోకి నీరు తీసుకున్నట్టు నటించి ఒడ్డుకు ఎక్కి వచ్చాడు. యుక్తి పారింది. కోనేరు అవతల నీటిలో పోసిన పాలే పాత్రలోకి వచ్చాయని అందరూ అనుకున్నారు.





# తాను తవ్విన గోతిలో...

అయిదు వందల ఏళ్ళ క్రితం హంగరీలో ధర్మాత్ముడని పేరుపడిన మాత్యాస్ అనే రాజు పరిపాలించిన కాలంలో, రాజధానికి కొంత దూరంలోని ఒక గ్రామంలో ఒక ధనికుడు ఉండేవాడు. 'ఆ ధనికుడికి నయ వంచన పుట్టుకతో వచ్చిన విద్య. అబద్ధాలు చెప్పి సాటివాళ్ళకు గోతులు తవ్వి, తన మాటలు నమ్మి వాళ్ళు అందులో పడితే ఆయన మహా ఆనందించేవాడు.

ఒకసారి ఆయన రాజధానికి వెళ్ళి, ఏవో బేరాలు చేసి సంచీడు బంగారు నాణాలతో తిరిగి వచ్చి, గ్రామంలో ప్రతి వాడితోనూ తాను కుక్కలను అమ్మి అంత బంగారమూ సంపాదించాననీ, అక్కడ కుక్కలకు వల్లమాలిన గిరాకీ ఉన్నదనీ చెప్పాడు.

ఈ మాట విన్న ఒక నిరుపేదవాడు ధనికుడు చెబుతున్న అబద్ధాలు ఎవరో చెప్పుకుంటూ ఉండగా విని, తాను కూడా నాలుగు డబ్బులు చేసుకుందామన్న ఆశతో ధనికుడి వద్దకు వచ్చి, "కుక్కల అమ్మకాన్ని గురించి నేను విన్నది నిజమేనా, బాబుగారూ?" అంటూ అడిగాడు.

"అవునురా! మాత్యాస్ మహారాజుగారు కుక్కలను ఎడా పెడా కొనేస్తున్నాడు! మంచి ధర ఇస్తున్నాడు. ఈ సంగతి తెలియగానే నేను ఎవరికీ చెప్పకుండా ఉన్న డబ్బంతా పెట్టుబడి చేసి కుక్కలను కొని, వాటిని రాజధానికి తీసుకుపోయి రాజుగారికి అమ్మాను. ఆ బేరంలో సంచీడు బంగారం సంపాదించుకున్నాను. పాపం, నువు పేదవాడివి గద. డబ్బు చేసుకోదలిస్తే రాజుగారికి కుక్కలను అమ్ము. ఆయనకు ఎన్ని కుక్కలైనా కావాలట! అందుచేత ఆయన ఇంకా చాలా కుక్కలను కొనబోతున్నారు." అన్నాడు ధనికుడు.

హంగరీ జానపద కథ

పేదవాడు ఈ మాటలు పూర్తిగా నమ్మాడు. వాడికి, పాపం, డబ్బు చేసుకోవాలన్న తహ తహ పుట్టుకొచ్చింది. కాని వాడి దగ్గిర పెట్టుబడికి డబ్బు ఏమీలేదు. అమ్ముదామన్నా ఒక బక్క చిక్కిన అవు తప్ప వాడి వద్ద మరేదీ లేదు. అయినా ఇంత మంచి అవకాశాన్ని దాటి పోనివ్వరాదని వాడు ఆ బక్క అవును సంతకు తీసుకుపోయి అమ్మి కొన్ని కుక్కలను కొని, వాటి మెడలకు తాళ్ళు కట్టి రాజధానికి తీసుకుపోయాడు.

కాని వాడు రాజభవన ద్వారం చేరినాక ద్వారపాలకులు వాణ్ణి లోపలికి పోనివ్వలేదు. ధనికుడు తనను నిష్కారణంగా దగా చేసినట్టు వాడికి అర్థమయింది. తనను చూసి రాజభటులు నవ్వుతుంటే పేదవాడు ఏడవసాగాడు.

రాజభవనం పైభాగం నుంచి రాజుగారు, కుక్కలను వెంట బెట్టుకుని ఉన్న ఒక పేదవాడు ఏడుస్తూ ఉండటం చూసి, విషయం తెలుసుకోగోరి, కుక్కలను వెంట బెట్టుకు వచ్చిన మనిషిని తన వద్దకు తీసుకురమ్మని ఒక సేవకుణ్ణి అజ్ఞాపించాడు.

పేదవాడు రాజుగారి వద్దకు వెళ్ళి, తన గ్రామంలోని ధనికుడు తనకు అబద్ధం చెప్పి ఎలా మోసం చేసినదీ వివరంగా చెప్పాడు.

రాజుకు వాణ్ణి చూస్తే జాలికలిగింది. ఆయన తాను కుక్కలను కొంటున్న మాట నిజమే నని చెప్పి, పేదవాడికి నూరు



బంగారు నాణాలు ఇప్పించి, కుక్కలను విడిపించి, ధనికుడి పేరు అడిగి కనుక్కున్నాడు.

పేదవాడి ఆనందానికి మేరలేదు. వాడు తన గ్రామానికి తిరిగి వెళ్ళి, తాను రాజు గారి దగ్గిర సంపాదించుకున్న బంగారం అందరికీ చూపించాడు.

ఆ పేదవాడు తన మాట విని నలుగురి లోనూ నవ్వులపాలు అవుతాడనుకుంటే, వాడు నిజంగానే కుక్కల బేరం చేసి బంగారం తెచ్చుకున్నందుకు ధనికుడికి అమితమైన ఆశ్చర్యం కలిగింది. తాను వేళాకోళానికి అన్న మాట అక్షరాలా నిజ మయింది.

ధనికుడికి చూస్తూ కూచో బుద్ధి పుట్ట లేదు. ఆయన తనకున్నదంతా అమ్మేసి, ఆ డబ్బుతో వేలకొద్దీ కుక్కలను కొని, వాటిని రాజధానికి తోలుకుపోయి, రాజ భవనం వద్ద ద్వారపాలకులతో తగాదా పెట్టుకున్నాడు. ద్వారపాలకులు ఆయననూ, కుక్కలనూ లోపలికి పోనివ్వలేదు. ధని కుడు కేకలు పెట్టాడు. ద్వారపాలకులు అంతకన్న గట్టిగా కేకలు పెట్టారు. కుక్కలు అరిచాయి.

ఈ సందడి అంతా ఏమిటా అని రాజు గారు మేడమీది నుంచి చూసి, ఆ మనిషినీ, కుక్కలనూ లోపలికి రానివ్వమని సేవ కులతో అన్నాడు.

ధనికుడు రాజుగారితో తాను కుక్కల బేరం మీద వచ్చినట్టు చెప్పాడు. ధనికుడి పేరు వినగానే, పేదవాణ్ణి మోసం చేసినది ఆయనేనని రాజుగారికి తెలిసిపోయింది. ఆయన ధనికుడితో, "నేను కుక్కలను ఒక్కసారే కొన్నాను. ఇంక నాకు కుక్కల అవసరం లేదు. నువు సమయం దాటి వచ్చావు, పాపం!" అన్నాడు.

ధనికుడు రాజధానికి ఎలా వెళ్ళాడో అలాగే స్వగ్రామానికి తిరిగి వచ్చాడు. కాకపోతే ఆయన ఆస్తి అంతాపోయింది. ఆయన చేసిన కుక్కల వ్యాపారం గురించి ప్రజలు చాలాకాలం చెప్పుకుని ఆనం దించారు.





# కవి సన్మానం

దేవగిరిలో ఒక గొప్ప ఆశుకవి ఉండేవాడు. ఆయన ప్రతి ఏడూ తన భార్యతో సహా ఒక పరిసర దేశానికి వెళ్ళి, ఆ దేశపు తీర్థాలు సేవించి, వింతలు చూసి, ఆ దేశపు రాజు గారి పూర్వోత్తరాలు తెలుసుకుని, రాజ సభకు వెళ్ళి, ఆశువుగా ఆయన పైన పద్యాలు చెప్పి, ఆయన చేత సన్మానం పొంది, దేవగిరికి తిరిగి వచ్చి సుఖంగా జీవిస్తూ ఉండేవాడు.

ఒక ఏడు ఆయన అమరావతీ పట్టణానికి వెళ్ళాడు. భార్యా భర్తలిద్దరూ అక్కడి వినోదాలన్నీ చూశారు. అమరావతిని పాలించే రాజు పరిపాలనలో సమర్థుడనీ, కవీశ్వరులను చాలా అభిమానిస్తాడనీ విన్నాడు కవి. ఆయన తన భార్యను రాజుగారు నిర్వహించే ధర్మసత్రంలో వదలి, తాను రాజసభకు వెళ్ళి, రాజుగారిని పొగడుతూ ఆశువుగా కొన్ని పద్యాలు చదివాడు.

కవిగారి ప్రతిభ చూసి సభికులందరూ పరమానందం చెందారు. రాజు తన్మయుడయిపోయాడు. ఆయన కవిని, "మీరు అమరావతిలో నివాసం ఏర్పాటు చేసుకోబోతున్నారా?" అని అడిగాడు.

"లేదు, మహారాజా. నేను ఏ దేశం వెళ్ళినా యాత్రార్థమేపోతాను. మా దేవగిరి నా శాశ్వత నివాసం. దాన్ని విడిచి నేను మరొక చోట ఉండలేను," అన్నాడు కవి.

ఈ మాట రాజుకు నిరాశకలిగించినట్టు కనబడింది. తన దేశం నుంచి ఒక్క వరహా కూడా పై దేశాలకు పోవటం ఆయనకు ఇష్టం లేదు. అందుచేత కవికి ఏవిధమైన బహుమానంగాని ఇవ్వటం రాజుకు ఇష్టం లేదు.

కాని, తన మీద అంత చక్కని కవిత్వం చెప్పిన కవిని ఏదోవిధంగా సత్కరించటం తన విధి కాబట్టి రాజు సభచాలిస్తూ, కవిని తన ఆతిథ్యం స్వీకరించమని కోరాడు.

సి. వేదవతి

కవి రాజుగారి ఇంట భోజనం చేసి, ఆయన పెట్టిన బట్టలు తీసుకుని తాను పొందిననిరాశ పైకి తెలియనివ్వక, ఆ సాయంకాలం రాజువెంట ఉద్యానవనానికి వెళ్ళి, చీకటి పడేవేళకు సత్రం చేరుకున్నాడు.

"రాజుగారిని చూశారా? కవిత్వం విని పించారా? రాజుగారు ఏ మిచ్చారు?" అని భార్య అడిగింది.

"అసలే లేనివాడాయె! ఏ మిస్తాడు, పాపం?" అన్నాడు కవి.

"అదేమిటి? రాజుగారు ఏమీ లేనివాడా?" అన్నది భార్య ఆశ్చర్యంతో.

"పొరపాటు నాది! చదువు సంధ్యలు రానివాణి రసిక చక్రవర్తి అన్నాను; అరణ్యాన్ని పాలించవలసిన వాణ్ణి మహా నగరాధీశుడన్నాను; పిల్లిని తరమటం చేత గాని వాణ్ణి మహావీరుడన్నాను. అంతా విని ఆ పుణ్యాత్ముడు ఏమీ ఇవ్వలేనని నోటితో చెప్పక, భోజనం పెట్టి, బట్టలిచ్చి పంపేశాడు," అన్నాడు కవి.

"ఆ భోజనమైనా ప్రజల సొత్తే కద!" అన్నది కవిభార్య.

ఆ సత్రంలో పనిచేసే వారిలో దాదాపు అందరూ రాజుగారి చారులే. కవికీ, ఆయన భార్యకూ జరిగిన సంభాషణ ఆ రాత్రే రాజుగారి చెవిన పడింది.

మర్నాడు ఉదయం కవి భార్యాసమేతుడై దేవగిరికి బయలుదేరిన కొద్ది సేపటికి ఒక బండి ఖాళీగాపోతూ వారికి తటస్థ పడింది. బండివాడు తానుకూడా దేవగిరికి పోతున్నానని చెప్పి వారిద్దరినీ బండిలో ఎక్కించుకున్నాడు.

కవి ఇంటికి చేరిన కొద్ది సేపటికి అమరావతి రాజుగారి దూతలు వచ్చి, ఒక మూటను కవి ముందు పెట్టి, "మహారాజుగారు తమకు యాభైవేల వరహాలు కానుక పంపారు. ఇంత మూట తమకు బరువవుతుందని మా ద్వారా పంపారు," అని చెప్పి శలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు.

ఆ యేడే కవి దేవగిరి నుంచి అమరావతికి తన నివాసం మార్చుకున్నాడు.





# డబ్బుల చెట్టు

పాపయ్యకు తండ్రి చిన్నతనంలోనే పోయాడు. అందుచేత ఆ కుటుంబం ఆర్థికంగా దెబ్బ తిన్నది. పాపయ్య తల్లి పాపయ్య మీదనే ఆశలన్నీ పెట్టుకుని అతన్ని పెంచింది.

కాని ఆమె ఆశలు నీరు కారిపోయాయి. పాపయ్య తిని తిరిగే వాడు. వట్టి మూర్ఖుడు, అస్తమానమూ తల్లిని డబ్బులు అడిగేవాడు.

తల్లికి విసుగెత్తి, "ఎప్పుడూ డబ్బులు అడుగుతావు, మన పెరట్లో డబ్బులచెట్టు ఉందనుకున్నావా?" అన్నది.

"అయితే డబ్బు పాతిపెట్టి డబ్బు చెట్టు మొలిపించి, నాకు కావలిసిన డబ్బులు నేనే కోసుకుంటాను," అన్నాడు పాపయ్య.

"డబ్బు పాతిపెడితే డబ్బు చెట్టు మొలవదురా. దేశం తిరిగి డబ్బు విత్తనం ఎక్కడ దొరికేదీ తెలుసుకో," అన్నది పాపయ్య తల్లి.

అమాయకుడైన పాపయ్య తల్లిమాట నమ్మి, ఇల్లు విడిచి బయలుదేరాడు. తాను ఎరిగిన వారిలో డబ్బు పుష్కలంగా ఉన్న వాళ్ళున్నారు. పాపయ్య వాళ్ళవద్దకు వెళ్ళి డబ్బు చెట్టు గురించి అడిగాడు.

వాళ్ళు పాపయ్యను చూసి నవ్వుకుని, "డబ్బుల చెట్టు అడవిలో దొరుకుతుంది," అన్నారు హేళనగా.

పాపయ్య ఆ మాట నమ్మి అడవికి బయలుదేరాడు. సాయంకాలానికి పాపయ్య అడవి చేరుకున్నాడు. అక్కడ ఒక ముసలమ్మ ఎండుపుల్లలు ఏరుకుంటూ వాడికి కనిపించింది.

"అవ్వా, డబ్బుల చెట్టు విత్తనం ఎక్కడ దొరుకుతుంది?" అని వాడు ముసలమ్మను అడిగాడు.

ముసలమ్మ తల ఎత్తి పాపయ్యను చూసి, అమాయకుడని గ్రహించి, "పొద్దు

దాసం అమ్మణి

పోతూ ఉంది. కాస్త పుల్లలు ఏరిపెట్టు, తర వాత చెబుతాను,'' అన్నది.

ఆనందంతో పాపయ్య గబ గబా పుల్లలు ఏరాడు.

''బాబూ, ముసలిదాన్ని, మోయలేను, ఈ పుల్లల మోపు కాస్త ఇంటిదాకా తెచ్చి పెట్టు,'' అన్నది ముసలమ్మ పాపయ్యతో.

సరే అని పాపయ్య పుల్లల మోపు ఎత్తు కుని, ముసలమ్మ వెనకాలే బయలుదేరాడు. కొంతసేపటికి ఇద్దరూ ముసలమ్మ ఉండే గుడిసె చేరుకున్నారు.

''బాబూ, ఈ పుల్లలు తీసుకుని ఊళ్ళోకి వెళ్ళి, అమ్మి డబ్బులు తీసుకురా,'' అన్నది ముసలమ్మ.

పాపయ్య దీక్షగా ఆ పుల్లల మోపు తీసు కుని ఊళ్ళోకి వెళ్ళి, దాన్ని అమ్మి డబ్బులు తెచ్చి, ముసలమ్మకు ఇచ్చాడు. ముసలమ్మ చాలా సంతోషించింది.

''అవ్వా, ఇప్పుడు చెప్పు, డబ్బుల చెట్టు విత్తనం ఎక్కడ దొరుకుతుంది?'' అని పాపయ్య ముసలమ్మను అడిగాడు.

''సమయం వచ్చినప్పుడు నేనే చెబు తాను. అంత వరకూ ఓపికపట్టు,'' అన్నది ముసలమ్మ.

అది మొదలు పాపయ్య ముసలమ్మ ఇంట్లోనే ఉంటూ, ఆమె చెప్పిన ప్రకారం అడవికి వెళ్ళి, కట్టెలు కొట్టితెచ్చి, వాటిని అమ్మి ముసలమ్మకు ఇస్తూ వచ్చాడు.

రోజులూ, వారాలూ, నెలలూ గడిచాయి. పాపయ్య కట్టెలు అమ్మగా వచ్చిన డబ్బులు ముసలమ్మకు ఇస్తూనే ఉన్నాడు.

ఒక నాడు ముసలమ్మ బరువైన డబ్బులమూట తెచ్చి పాపయ్య చేతికి ఇచ్చింది. పాపయ్య ఆశ్చర్యపోయాడు.

ముసలమ్మ వాడితో, ''చూశావా, బాబూ? కష్టపడితే డబ్బు సంపాదించవచ్చు. కష్టమే డబ్బుకు విత్తనం. ఇక నువు వెళ్ళి, కష్టపడి పనిచేసి, నీ తల్లిని సుఖపెట్టు,'' అన్నది.

పాపయ్య ముసలమ్మ దగ్గిర సెలవు తీసుకుని ఇంటికి తిరిగి వెళ్ళాడు. వాడు కష్టార్జితంతో ఇంటికి తిరిగి వచ్చినందుకు వాడి తల్లి సంతోషించింది.






కృష్ణుడు ప్రసాదించిన దివ్యదృష్టితో ధృతరాష్ట్రుడు విశ్వరూపాన్ని ఆశగా చూశాడు. తరవాత ఆయన కృష్ణుడితో, "భగవంతుడా, ఎంతో దయతో నువు నాకు దివ్యనేత్రాలు ఇచ్చావు. వీటిని మళ్ళీ నువే తీసుకో. నీ రూపాన్ని చూసిన కళ్ళతో మామూలు మనుషులనూ, ప్రపంచాన్నీ చూడలేను," అన్నాడు.

మరుక్షణం సభ ఎప్పటిలాగే ఉన్నది. కృష్ణుడు మామూలుగానే ఉన్నాడు. నారదుడు మొదలైన దేవర్షులు సభలో లేరు. కృష్ణుడు సభలోని ఋషులతో వస్తానని చెప్పి, ఒక చెయ్యి సాత్యకికీ, రెండో చెయ్యి విదురుడికి ఇచ్చి, సభ నుంచి బయలుదేరాడు. అతని వెంట కౌరవులూ, మిగిలిన రాజులూ బయలుదేరారు. చాలా కోపంలో ఉన్న కృష్ణుడు వారి వంక చూడనైనా లేదు.

ద్వారం వద్ద దారుకుడు రథంతోసహా సిద్ధంగా ఉన్నాడు. కృష్ణుడు రథంలో ఎక్కి కూర్చోగానే ధృతరాష్ట్రుడు అతనితో, "కృష్ణా, నన్ను నువు అపార్థం చేసుకోవద్దు. పాండవుల పట్ల నాకు ఎలాటి దురుద్దేశమూ లేదు. నేను దుర్యోధనుడికి చెప్పినహితం నువు విన్నావు, సభలో అందరూ విన్నారు గదా!" అన్నాడు.

కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణీ, భీష్మ, ద్రోణ, బాహ్లిక, కృపులలాటి పెద్దలనూ ఉద్దేశించి, "మహాత్ములారా, సభలో జరిగిన దంతా మీరు చూశారు. దుర్యోధనుడు రోషంతో సభనుంచి లేచిపోయాడు. ధృతరాష్ట్రుడు తాను అసమర్థుణ్ణి అని అన్నాడు. నేను

**50. యుద్ధసన్నాహం**



వచ్చినపని ముగిసింది. వెళుతున్నాను. నాకు శలవు ఇప్పించండి," అన్నాడు.

పెద్దలందరూ కృష్ణుడికి వీడ్కోలు చెప్పి తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. కృష్ణుడు రథం మీద తన మేనత్త అయిన కుంతి ఇంటికి వెళ్ళాడు. అతను కుంతీ దేవికి కౌరవసభలో జరిగినదంతా చెప్పి, "దేవీ, ఎందరు ఎన్నివిధాల చెప్పినా దుర్యోధనుడు వినిపించుకో లేదు. రాజ లోకానికి కాలం మూడింది. అర్జునుడు వాళ్ళను కార్చిచ్చులాగా దహిస్తాడు. నేను పాండవుల దగ్గిరికి పోతున్నాను. వారికి ఏమన్నా సందేశం ఇస్తావా?" అని అడిగాడు.

"నాయనా, ధర్మానికి భంగం రానివ్వ వద్దని ధర్మరాజుతో చెప్పు. క్షత్రియులు బాహుబలంతో జీవించటం ధర్మం. అందు కోసం హింస చెయ్యవలసి వస్తే అది విధి నిర్ణయమన్న మాట. పూర్వం కుబేరుడు ముచికుందు డనే రాజర్షికి భూమండల మంతా ఇస్తానంటే ముచికుందుడు తీసు కోక, తన భుజబలంతో సంపాదించుకున్న రాజ్యమే తనకు కావాలన్నాడట. ధర్మ రాజు ఇప్పు డనుసరించే మార్గం నాకు నచ్చినది కాదు. అది పాండు రాజుగాని, భీష్ముడుగాని ఆమోదించేదికూడా కాదు. అతనికి నిత్యమూ యజ్ఞ దాన తపస్సులూ, శౌర్యప్రజ్ఞలూ, బలమూ, ఓజస్సు ఉండా లని నేను దీవించినట్టు చెప్పు. రాజ్యపాలన ధర్మ బద్ధంగా చెయ్యటం ఉత్తమ క్షత్రియ లక్షణం; భిక్షాటనమూ, వ్యవసాయమూ వాణిజ్యమూ పనికి రావు. పాండవులు తమ తండ్రి రాజ్యభాగాన్ని తాము రాబట్టుకోవాలి. నాకు పరుల అండన బతకటం కన్న దుఃఖం ఏమి ఉంటుంది? యుద్ధం చేసి తండ్రి తాతలకు ఉత్తమలోకాలు కలిగించ మని ధర్మరాజుతో చెప్పు," అన్నది కుంతి కృష్ణుడితో.

ఆమె కృష్ణుడికి వీడ్కోలు చెబుతూ, తాను తన కొడుకులనూ, కోడలినీ అడిగినట్టు చెప్పమన్నది.

కృష్ణుడు కుంతి మందిరం నుంచి బయలుదేరి, కౌరవ ముఖ్యులందరికీ వీడ్కోలు చెప్పి, సాత్యకితోపాటు కర్ణుణ్ణి కూడా తన రథం మీద ఎక్కించుకుని బయలుదేరాడు. రథం నగరం దాటి నిర్జన మైన ప్రదేశం చేరగానే, కృష్ణుడు కర్ణుడితో ఏకాంతంగా, "కర్ణా, నువు వేదాలూ, ధర్మ శాస్త్రాలూ చదువుకున్న వాడివి. అందుచేత నువు గ్రహించ గలవు. కన్యగా ఉండగా స్త్రీకి పుట్టిన వాణ్ణి కానీనుడు అంటారు. అలాంటి కన్య ఎవరిని వివాహం చేసు కుంటే వాడే కానీనుడికి తండ్రి అవుతాడు. నువు కుంతీదేవికి కానీనుడుగా పుట్టిన వాడివి. అందుచేత పాండురాజు పెద్దకొడు కువు; ధర్మశాస్త్రాల ప్రకారం రాజు కావలిసిన వాడివి. నీకు తండ్రి పక్షాన పాండవులూ, తల్లి పక్షాన వృష్ణివంశం వాళ్ళూ బంధువులు. నా వెంట వచ్చా వంటే పాండవులూ, వాళ్ళ కొడుకులూ, పాండవుల పక్షాన వచ్చిన రాజులూ నీ పాదా లకు నమస్కరించుతారు. నీకు పట్టాభి షేకం జరుగుతుంది. ద్రౌపది నిన్ను ఆరవ భర్తగా స్వీకరిస్తుంది. ధర్మరాజు నీకు యువరాజుగా ఉంటాడు," అని చెప్పాడు.



దానికి కర్ణుడు, "కృష్ణా, నా మీది ప్రేమతోనూ, స్నేహంతోనూ నువు చెప్పిన దంతా విన్నాను. నేను పాండురాజు కొడుకు ననటానికి సందేహంలేదు. కుంతీ దేవి నన్ను కని నదిలో పారేస్తే, అధిరథు డనే సూతుడు నన్ను చూసి తెచ్చి తన భార్య అయిన రాధకు ఇచ్చాడు. నన్ను అష్టకష్టాలు పడి పెంచిన ఆ దంపతులకు పిండాలు పెట్టటం నా ధర్మం కాదా? నాకు వాళ్ళే నామకరణం చేసి వసుషేణు డని పేరు పెట్టారు. ఇతర సంస్కారాలన్నీ చేశారు. వాళ్ళ బంధువుల పిల్లలనే నేను పెళ్ళాడాను. నాకు వారియందు కొడుకులూ, మనమలూ కూడా కలిగి పెరుగుతున్నారు. పదమూడేళ్ళుగా ధృతరాష్ట్రుడి ఇంట, దుర్యోధనుడి అండన రాజ్యభోగాలు అనుభ విస్తున్నాను. నన్ను చూసుకుని దుర్యోధనుడు



పాండవులతో యుద్ధానికి సిద్ధపడ్డాడు, అర్జునుడితో ద్వంద్వ యుద్ధం చెయ్యమని అతను నన్ను కోరాడు. భయంచేత గాని, లోభంచేత గాని నేను దుర్యోధనుడికి అన్యాయం చెయ్యను. నేను అర్జునుడితో యుద్ధం చెయ్యకపోతే మా ఇద్దరికీ అపకీర్తి తప్పదు. నీ సహాయంతో పాండవులు తప్పక జయిస్తారు. నేను తన అన్ననని తెలిస్తే ధర్మరాజు రాజ్యం కోరడు. నేనేమో ప్రపంచమంతా జయించినా ఆ రాజ్యాన్ని దుర్యోధనుడికే ఇస్తాను. భూమినంతా ధర్మరాజునే ఏలుకోనియ్యి. దుర్యోధనుణ్ణి సంతోష పెట్టటానికి పాండవులను గురించి చాలా హీనంగా మాట్లాడాను. నేను చెప్పినట్టు ఎవరికీ చెప్పక, అర్జునుణ్ణి యుద్ధానికి సిద్ధుణ్ణి చెయ్యి," అన్నాడు.

కృష్ణుడు నవ్వి, "నీకు రాజ్యకాంక్ష లేదన్నమాట. సరే, ఈ మాసం యుద్ధానికి బాగున్నది. ఇంకా వారం రోజులకు అమావాస్య వస్తుంది. ఆ రోజున యుద్ధం ప్రారంభమయేటట్టు చూడమని భీష్మ, ద్రోణ, కృపులతో చెప్పు. నువు కూడా యుద్ధానికి సిద్ధంగా," అన్నాడు.

కర్ణుడు కృష్ణుణ్ణి కౌగలించుకుని, సెలవు పుచ్చుకుని, తన రథం మీద ఇంటికి వెళ్ళాడు. కృష్ణుడు సాత్యకితో సహా తన రథంలో ఉపప్లావ్యానికి బయలుదేరాడు.

కృష్ణుడు తాను చేసిన కృషి ఫలించక తిరిగి వెళ్ళగానే విదురుడు కుంతీదేవి వద్దకు వచ్చి, "నేను ఏది వద్దు అనుకున్నానో అదే జరగబోతున్నది. పాండవ కౌరవులు మహాయుద్ధంలో అనేక లక్షల ప్రాణాలను బలిపెట్ట బోతున్నారు. కృష్ణుడు సంధి కుదర్చలేక తిరిగి వెళ్ళాడు," అని దుఃఖించాడు.

కుంతీదేవికి కూడా, యుద్ధంలో భీష్మ ద్రోణుల వంటి మహాపురుషులు చావటం భయంకరంగా తోచింది; తన కొడుకులు యుద్ధంలో జ్ఞాతులను చంపి విజయం పొందటం కన్న దారిద్ర్యంతో మాడి చావటమే మేలేమో ననిపించింది.

రానున్న ఆపదకు మూలకారకుడు కర్ణుడే ననీ, అతను తన కొడుకులను ద్వేషిస్తూ, వారిని చంపటానికి నిశ్చయించు కున్నాడనీ ఆమె అనుకున్నది. అందుచేత ఆమె కర్ణుడి మనసు పాండవులకు అనుకూలంగా మార్చ టానికి నిచ్చయించుకుని, గంగా తీరాన కర్ణుడు జపం చేసుకుంటున్న చోటికి వెళ్ళింది. కర్ణుడు తూర్పుగా తిరిగి, చేతు లెత్తి జపం చేసుకుంటున్నాడు. కుంతి అతని వెనకగా వచ్చి, ఎండదెబ్బకు వడలి, కర్ణుడి పై బట్టమీద కూర్చున్నది.

కర్ణుడు జపం చాలించి, కుంతిని చూసి నమస్కారం చేసి, "అమ్మా, కర్ణుణ్ణి, నమస్కారం చేస్తున్నాను. ఏ పనిమీద ఇక్కడికి వచ్చావు?" అని అడిగాడు.

"నాయనా, నువు నా కొడుకువు. రాధ కొడుకువు కావు. సూతకులం వాడివి కావు. నా మాట నమ్ము. నువు నీ తమ్ములను ఎరగక, దుర్యోధనుడి కోసం మహా పాపానికి ఒడిగట్టటం అనుచితం. అర్జునుడు స్వశక్తితో గెలుచుకున్న రాజ్యాన్ని కౌరవులు అపహ రించారు. నువు దానిని ధృతరాష్ట్రుడి కొడుకుల నుంచి తీసుకుని నువే ఏలుకో. బలరాముడూ, కృష్ణుడూలాగ నువూ, అర్జు నుడూ ప్రేమగా అన్నదమ్ములై ఉండండి. మీ రిద్దరూ ఏకమైతే మీకు అసాధ్యం ఏమీ ఉండదు," అన్నది కుంతి.



ఈ మాటలు విని కర్ణుడు ఏ మాత్రమూ చలించక, కుంతితో ఇలా అన్నాడు:

"అమ్మా, నీ మాటలు నేను వినను. నువు నాకు మహాపాపం చేశావు. ఏ శత్రువూ నాకు అంతకన్న పాపం చెయ్యలేదు. పుట్ట గానే నన్ను పారేశావు. నేను క్షత్రియుడుగా పుట్టినా సూతుడుగా పెరిగాను. నాకు క్షత్రియ సంస్కారాలు ఏవీ జరగలేదు. ఇన్నాళ్ళూ నా క్షేమం నీకు పట్టలేదు. ఇప్పుడు నువు నీ మంచికోరి నాకు హితం చెబుతున్నావు. నే నిప్పుడు పాండవుల పక్షం అయితే, భయపడి వాళ్ళ అండన చేరానని లోకం అనుకుంటుంది. యుద్ధం జరగబోతూ ఉండగా నేను పాండవులకు అన్నననీ



ప్రకటిస్తే రాజులంతా నన్ను దుమ్మెత్తి పొయ్యరా? ధృతరాష్ట్రుడి కొడుకులు నన్ను ఎంతో ఆదరించి, సత్కరించారు. ఆ సత్కారాలన్నీ వ్యర్థపుచ్చనా? నా మీద ఆధారపడి వాళ్ళు యుద్ధానికి సిద్ధమయారు. నేను వారి ఋణం తీర్చుకోవటానికి ప్రాణాలైనా అర్పించాలి. దుర్యోధనాదుల కోసం నేనూ, నా కొడుకులూ ప్రాణం ఉన్నంత దాకా పోరాడతాం. అయినా నువు నీ కొడుకులను గురించి భయపడి వచ్చావు గనక నిన్ను నిరాశ చెయ్యను. నీ కొడుకులందరినీ నేను చంపను. ఒక్క అర్జునుడు మినహాగా, మిగిలిన పాండవులెవరి ప్రాణాలూ తీయను. అర్జునుణ్ణి చంపితేనేగాని నా బల పరాక్రమాలు సార్థకం కావు. యుద్ధంలో అర్జునుడు చచ్చినా నాతోకలిసి అయిదుగురు కొడుకులు నీకుంటారు. నేనే చచ్చినా నీకు అయిదుగురు కొడుకులుంటారు. నీకు ఆరుగురు కొడుకులు ఏ పరిస్థితిలోనూ ఉండరు. నువు నిశ్చింతగా ఉండు.''

కుంతి దుఃఖావేశంతో కర్ణుణ్ణి కౌగలించుకుని, ''నాయనా, ఇది విధి విలాసం. కౌరవులు నాశనం కాక తప్పదు. నీ తమ్ములు నలుగురికి అభయం ఇచ్చినమాట మరవకు. నీకు శుభం కలుగుగాక!'' అని దీవించింది. కర్ణుడు ఆమె పాదాలకు నమస్కారం చేసి తన ఇంటికి వెళ్ళాడు. కుంతి తన మందిరానికి తిరిగి వచ్చింది.

కృష్ణుడు ఉపప్లావ్యం చేరుతూనే పాండవులకు జరిగినదంతా చెప్పాడు. అతను చాలా సేపు వారితో మంత్రాలోచన చేసి తన విడిదికి వెళ్ళి విశ్రాంతి తీసుకున్నాడు.

ఆ రాత్రి పంచపాండవులు కృష్ణుడితో సహా యుద్ధ సన్నాహం గురించి చర్చించారు. పాండవుల పక్షాన పోరాటానికి ఏడు అక్షౌహిణుల సేన సిద్ధంగా ఉన్నది. ఒక్కొక్క అక్షౌహిణికీ ఒక్కొక్క నాయకుడు నియమించ బడ్డాడు. ఆ ఏడుగురు అక్షౌహిణీ నాయకులూ ఎవరంటే: విరాటుడూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, సాత్యకీ, చేకితానుడూ,

భీముడూనూ. ఈ ఏడుగురి మీదా ఒక మహా నాయకుడుండాలి. అతను భీష్ముడికి దీటైనవాడుగా ఉండాలి. అలాంటి వాడు ఎవడని ధర్మరాజు తన తమ్ములను అడిగితే, సహదేవుడు విరాటుణ్ణీ, నకులుడు ద్రుపదుణ్ణీ, అర్జునుడు ధృష్టద్యుమ్నుణ్ణీ, భీముడు, శిఖండినీ సూచించారు. ఏ ఇద్దరూ ఒక విధంగా చెప్పకపోవటంతో ధర్మరాజు కృష్ణుడి అభిప్రాయం ప్రకారం సర్వసేనానిని నిర్ణయింతామన్నాడు. కృష్ణుడు ధృష్టద్యుమ్నుణ్ణే సూచించాడు.

పాండవ బలాలకు ధృష్టద్యుమ్నుడు సర్వసేనానిగా నిర్ణయించ బడినట్టు తెలిసి రాజులందరూ సంతోషించారు. ఆర్భాటంగా సైనిక సన్నాహం ఆరంభమయింది. రథాలు నడిచాయి. శంఖాలూ, దుందుభులూ మోగాయి. పాండవుల బలాలు మహా సముద్రంలాగా కదిలాయి. సేనకు ముందు భీమ, నకుల, సహదేవులు వెళ్ళారు. వాళ్ళ వెనకగా అభిమన్యుడూ, ఉపపాండవులూ, ధృష్టద్యుమ్నుడూ, ఇతర పాంచాల యోధులూ కదిలారు. సేన మధ్యలో ధర్మరాజున్నాడు. సైన్యం వెంట రకరకాల వాహనాలూ, యంత్రాయుధాలూ, వైద్యులూ, పరిచారకులూ ఉన్నారు. ద్రౌపది తన దాసదాసీజనంతో సహా ఉపప్లావ్యంలోనే ఉండిపోయింది.

పాండవులు సేనలతో బయలుదేరే ముందు బ్రాహ్మణులకు గోవులూ, బంగారమూ దానం చేసి, వారి ఆశీర్వాదాలు పొందారు.

సేన వెనక భాగంలో విరాటుడూ, కుంతిభోజుడూ, ధృష్టద్యుమ్నుడి కొడుకులూ; నలభైవేల రథాలూ, రెండు లక్షల గుర్రాలూ, అయిదు లక్షల కాల్బలమూ, అరవైవేల ఏనుగులూ వెంట బెట్టుకుని చేకితానుడూ, ధృష్టకేతుడూ, సాత్యకీ, కృష్ణుడూ అర్జునుడూ కదిలారు.

ఈ మహాసేన కురుక్షేత్రం చేరగానే శంఖాలు మోగాయి. సైనికులు పరమానంద భరితులై, దిక్కులు పిక్కటిల్లేటట్టు సింహనాదాలు చేశారు.





# శివలీలలు

## 5

దక్షిణాన పొత్తపినాడు అనే ప్రాంతంలో అరణ్యం ఉండేది. అందులో శబరులు ఉంటూ ఉండేవారు. ఉడుమూరు అనేది వాళ్ళ ముఖ్యనగరం. ఆటవికులైన శబరులు వేటాడీ, వ్యవసాయం చేసీ జీవిస్తూ ఉండేవారు.

శబరులకు రాజు నాథనాథుడు. అతని భార్య పేరు తండె. వారికి తిన్నడు అనే కుమారుడు కలిగాడు. వాడు పెద్దవాడవుతూ, విలువిద్య నేర్చుకున్నాడు. వాడికా విద్య పుట్టుకతోనే వచ్చినట్టు కనబడింది. ఎందుకంటే, విల్లు పట్టుకున్న నలభై రోజులకే వాడు అరణ్యంలో పరిగెత్తే లేడినీ, ఆకాశంలో ఎగిరే పక్షినీ కొట్టగలిగాడు.

శబరులు తమ రాజుతో తిన్నడికి వేట విద్యలు నేర్పాలన్నారు. ముందుగా శబరులందరూ శివుడికి పూజలు చేసి, వేటలు బలి పెట్టి, తాగి తందనాలాడి ఉత్సవం జరిపారు. మర్నాడు శబరరాజు తన కొడుకు వెంట వేటకు వెళ్ళవలిసిన వారిని ఎన్నుకుని, వేటకు కావలిసిన ఉచ్చులూ, వలలూ, కుక్కలు మొదలైన జంతువులూ సిద్ధం చేశాడు. పెద్ద సన్నాహంతో తిన్నడు తన జాతి వాళ్ళను వెంట బెట్టుకుని తిరుపతి కొండల కేసి బయలుదేరాడు.

వేట చాలా విజయవంతంగా సాగింది. శబరులు రకరకాల అడవి జంతువులనూ, పక్షులనూ చంపారు; మాంసం ముక్కలు పుల్లలకు గుచ్చి కాల్చి, అడవి తేనెతో కలిపి తిన్నారు. ఈ విధంగా వన్యమృగాలను వేటాడుతూ వాళ్ళు చాలా రోజులు అడవిలోనే మకాం పెట్టారు.

ఒకనాడు తిన్నడు వేటాడి అలసి, ఒక పొగడచెట్టు నీడలో పడుకుని నిద్రపోయాడు.

అట్ట చివరి బొమ్మ



ఆ నిద్రలో వాడికి ఒక కల వచ్చింది. కలలో ఒక మహాపురుషుడు కనిపించాడు. ఆ మనిషి ఒంటి నిండా విభూతి పూసుకుని, పులితోలు కట్టుకుని, ఎర్రటి జెడలు వేళ్ళాడుతూ, భుజాన పుర్రెలమాల ధరించి, మెడలో లింగాన్ని ధరించి ఉన్నాడు. ఆయన తిన్న డితో ప్రేమగా, "అబ్బాయీ, ఇక్కడ కొండ పక్కన, సువర్ణముఖినదీ తీరాన, మర్రి చెట్టు కింద శివుడున్నాడు. అక్కడికి వెళ్ళి పూజించు, నాయనా!" అని చెప్పి, అంత ర్ధానమయాడు.

తిన్నడు అదిరిపడి నిద్రలేచి, ఆశ్చర్యంతో నాలుగు దిక్కులా చూశాడు. తన తోటి వాళ్ళు వేటలో నిమగ్నులై ఉన్నారు. వాళ్ళ ఈలలూ, కేకలూ వినిపిస్తున్నాయి. అంతలో ఒక అడవిపంది వేటగాళ్ళను తప్పించు కుని, గుర్రుగుర్రు మని అరుస్తూ, పరిగెత్తు కుంటూ రావటం తిన్నడి కంట పడింది. వాడు దాన్ని కొట్టటానికి వెంట తరిమాడు. ఆ అడవి పంది వాడికి అందకుండా పరి గెత్తుతూ, చాలాదూరం తిప్పి, అకస్మాత్తుగా అదృశ్యమయింది.

అది మాయమైన చోటనే శివాలయం ఉన్నది. కలలో తిన్నడికి కనిపించిన మహా పురుషుడు చెప్పినది ఈ శివుణ్ణి గురించే. అందుచేత జరిగినదంతా శివమాయ అని గ్రహించి తిన్నడు ఆనందబాష్పాలు రాల్చుతూ ఆ లింగానికి సాష్టాంగ నమ స్కారం చేసి, "స్వామీ, ఈ కొండ ప్రదే శంలో పులులూ, సింహాలూ సంచరించే చోట, ఏటి ఒడ్డున ఎందుకు కూర్చున్నావు? నీకు ఆకలి అయితే తిండీ, నీరూ ఎవరు తెచ్చిపెడతారు? మా ఊడుమూరికి రావయ్యా! చిన్నక్కలూ, పెద్దక్కలూ నీకు పందిమాంసమూ, దుప్పిమాంసమూ, పిట్టలమాంసమూ కమ్మగా వండి పెడ తారు; రకరకాల బియ్యాలతో పాయసం వండి పెడతారు; రకరకాల తేనెలూ, పళ్లూ నీకు లభిస్తాయి. మా వూరికి వచ్చెయ్యి. నా వెంట వచ్చావా సరేసరి, లేకపోతే నేను ఇక్కడి నుంచి కదలను," అన్నాడు.

ఇంతలో మిగిలిన శబరులు తిన్నణ్ణి వెతుక్కుంటూ వచ్చి, "తిన్నా, నువు తరిమిన అడవిపంది ఏమయింది?" అని అడిగారు. శివ ధ్యానంలోవున్న తిన్నడు మాట్లాడలేదు. వాళ్ళు అతన్ని ఇంటికి పోదాం పదమన్నారు.

"ఈ శివుడు నా వెంట వస్తేగాని నేను ఇక్కడి నుంచి కదలను. మీరు వెళ్ళండి," అన్నాడు తిన్నడు. అతను తిరిగి శివధ్యానంలో పడిపోవటం చూసి శబరులు వెళ్ళిపోయారు.

"పాపం, శివుడు ఎంతకాలంగా పస్తులుంటున్నాడో!" అనుకుని తిన్నడు విల్లు భుజాన పెట్టుకుని వెళ్ళి, అడవి పందిని చంపి, మాంసం ముక్కలు కాల్చి, సువర్ణముఖిలో నీరు తెచ్చి, అంతా శివుడి ముందు పెట్టి, "ఆరగించు!" అన్నాడు.

దానికి శివుడు జవాబియ్యలేదు. "నువు తినకపోతే నీ పాదాల దగ్గిరే ప్రాణాలు విడుస్తాను," అంటూ తిన్నడు ఏడవటం మొదలు పెట్టాడు.

శివుడు అతని భక్తికి మెచ్చి, "లే, బాబూ! అలాగే తింటాను," అని, తిన్నడు పెట్టినదంతా తినేశాడు.

ఇలా కొంతకాలం గడిచింది. ఒకనాడు శైవుడైన బ్రాహ్మణు డొకడు శివగోచరు డనే వాడు ఆ గుడికి వచ్చి, "ఈ ఎంగిలి పుల్లలేమిటి? స్వామీ, నీ ఆలయాన్ని ఇలా ఎవరు మైల పరిచారు? చెప్పకపోయావో, తిండిమాని ప్రాణాలువిడుస్తాను," అన్నాడు.



"కంగారుపడకు. ఒక ఆటవికుడు తన ధోరణిలో నన్ను మహాభక్తితో కొలుస్తున్నాడు. వాడి పూజను నేను స్వీకరిస్తున్నాను. వాడి భక్తి చూడ గోరినట్టయితే నా వెనక పక్క కనపడకుండా దాక్కో!" అని శివుడు పలికాడు.

అంతలోనే తిన్నడు గుడికి వచ్చి, లింగం ముందున్న ఎంగిలి కాలితో ఒక పక్కకు తోసి, నీళ్ళు పుక్కిలించి లింగం మీద అభిషేకించి, పత్రి పెట్టి, తినమని మాంసం ముక్కలు శివుడి ముందు పెట్టాడు.

శివుడు తిన్నడి భక్తిని పరీక్షించాలని, వాడు పెట్టిన ఆహారం తినక, మూసిన కంటి నుంచి నీరు కార్చనారంభించాడు. అది చూసి తిన్నడు ఆందోళనపడి కంటికి చికిత్సలు చెయ్యసాగాడు. వాడు తనకు తెలిసిన చికిత్సలూ, విన్నవీ ఎన్నో చేశాడు. అవేవీ పని చెయ్యకపోగా శివుడి కంటి నుంచి నెత్తురు కారసాగింది.

ఏం చెయ్యటానికీ పాలుపోక తిన్నడు, "కంటికి కన్నే మందు!" అనుకుని, తన కన్ను ఒకటి తీసి, శివుడికి కన్నుగా అమర్చాడు.

వెంటనే శివుడి రెండో కంట నుంచి రక్తం కారసాగింది.

"భయం లేదు. దానికి కూడా చికిత్స నా దగ్గిర ఉన్నది," అంటూ తిన్నడు తన రెండో కన్ను పెకలించబోతూండగా శివుడు, "ఆగు! ఆగు!" అంటూ తిన్నడి చెయ్యి పట్టుకుని, వాడి ఎదట ప్రత్యక్షమయాడు.

ఆయన బ్రాహ్మడితో, "శివగోచరా! చూశావు గదా ఈ పామరుడి భక్తి! నీకు నచ్చింది కద!" అని, ఆ బ్రాహ్మణుణ్ణీ, తిన్నడినీ ఎదురుగా పెట్టుకుని, "మీకేం వరం కావాలి?" అని అడిగాడు.

"మీకు తోచిన వరం ఇవ్వండి. మేమా అడిగేవాళ్ళం?" అంటూ ఇద్దరూ శివుడి ముందు సాష్టాంగ పడ్డారు.

శివుడు వారిభక్తికిమెచ్చి, వారిని తిరిగి ప్రాపంచిక విషయాలలో పడనివ్వక, ఇద్దరినీ తనలో చేర్చుకున్నాడు.



# 137. రాక్షసి బొమ్మలు

ఉత్తర అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో బ్లైత అనే చోట ఈ బొమ్మలు ఉన్నాయి. నేల మీది నుంచి వీటి పూర్తిరూపం కనిపించదు. అందుచేత ఈ బొమ్మలు వేసినవారు తాము ఏమి వేస్తున్నదీ సరిగాచూసి ఉండే అవకాశం లేదు. ఇలాటి బొమ్మలు అనేకం ఈ ప్రాంతంలో గులక రాళ్ళతో అమర్చి ఉన్నాయి. వీటిని విమానంలో నుంచి మాత్రమే చూడటం సాధ్యం. వీటిని 1943 లో మొదట ఫొటోగ్రాఫ్ చేశారు.

దిగువ బొమ్మలో రెండు చిత్తరువులు మాత్రమే కనిపిస్తున్నాయి. కాని ఈ ప్రాంతంలో ఇంకా మరికొన్ని రాకసి చిత్రాలున్నాయి. ఇవి ఏమంత లోతైనవి కావు, కాని చాలా నిడివిగలవి. మనిషి బొమ్మ నిడివి తలనుంచి కాలి పాదానికి 170 అడుగులు. చాచిన చేతుల మధ్య వెడం 158 అడుగులు. రెండవది పొడుగుతోక గల గుర్రం. క్రి. శ. 1540 కి పూర్వం ఇక్కడ గుర్రాలే లేవు గనక ఈ రాకసి బొమ్మలు ఆ తరవాతనే అమెరికన్ ఇండియనులు సృష్టించినట్టు ఊహిస్తున్నారు.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

కడవలో నీళ్ళు లేవు

పంపినవారు:
సి. గోపాలరావు

Photo by D. N. Prasad



ముద్దనగేరి.
(కర్నూలుజిల్లా)

కడుపులో ఏమీ లేదు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు మే నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూలై నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట :
ఢిల్లీమసీదు

మూడవ అట్ట :
ఆగ్రామసీదు

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

